# రత్నాపణము

(అనిబద్ధకావ్యసంపుటము)



గ్రంథకర్త:
పెనుమర్తి వెంకటరత్నము

సారస్వతకుటీరము : తెనాలి
1934

వెల : రు. 1-8-0

# అంకితము

నిరాడంబరుఁడైన

తండ్రిగారికి.

# ప రి చ య ము

ఇందు సంకలింపబడ్డ అనిఁబద్ధకావ్యములు సుమారు ౭, ౮ సంవత్సరముల ప్రాయము గలవి. వీనిలో కొన్ని సాహితి, శారద, భారతి, సుజాత, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక మొదలగువానిలోఁ బ్రకటింపఁబడినవి. ఆయాపత్రికాధిపతులకుఁ గృతజ్ఞుఁడను.

రత్నపరీక్షయం దారితేఱిన భావుకులకీ కావ్యాలలో నేదేని రమణీయమైన దొక్కటి కనఁబడినా, నేను ధన్యుఁడను.

సారస్వతకుటీరం: తెనాలి,
౧౭-౨-౧౯౩౦.

పెనుమర్తి
వెంకటరత్నము.

# కవిజీవిత సంగ్రహము

'Great geniuses have the shortest biographies Their cousins can tell you nothing about them. They live in their works and - so their house and street-life is trivial and commonplace.'

R. W. Emerson.

ఎమర్సను పండితునియొక్క వాక్యములు శ్రీవెంకటరత్నముగారి కెల్లవిధముల వర్తించును. చిఱుతప్రాయముననే, మహోన్నతభావములు, శైలికలిగిన కవిత్వమును తెనుఁగున రచించి, ప్రసిద్ధికెక్కి, క్షయవ్యాధి పీడితుఁడై, ఇరవైమూఁడువత్సరములు నిండక మునుపే మృతినొందిన శ్రీవెంకటరత్నము గారు చిరస్మరణీయులు.

జననము : 11-12-1907.     మరణము : 4-8-1930.

జన్మభూమి తెనాలిదగ్గర పోతుమర్రు అగ్రహారము. పదిహేనువత్సరముల ప్రాయమునుండి స్వాంతముగ సారస్వతమున కృషిసలిపి, మనోహరమైనకవిత్వము వ్రాయఁదొడఁగిరి. సంస్కృతమున 'ఉభయభాషా ప్రవీణ' చదువుచు, పరలోకమున కేగిరి. 'భామహుఁడు' 'కన్నడవాఙ్మయములోని యాంధ్రకవులు' మొదలైన వ్యాసములను గూడ రచించెను. ఆయనస్మృతిచిహ్నముగ నుండిన నాలుగేండ్లకుమారుఁడుకూడ, ఆయన మరణించిన నాల్గుదినములకు పరలోకమున కేగెను.

# మనవి

సోదరుని మరణానంతర మీగ్రంథమును ప్రకటింప నెంతయో ప్రయత్నించితిని. నాప్రయత్న మీనాటికి సిద్ధించినది. తన ప్రియమిత్రుఁడైన ప్రభల రామబ్రహ్మానందము క్షయవ్యాధిచే మరణించు టెఱింగినవాఁడై, తానుగూడ మిత్రునివలె మరణించుట నిశ్చయ మని తలంచి కవి, తనయీరత్నాపణ మను ఖండకావ్యసంపుటమున కొక పరిచయమును వ్రాసెను. సోదరుని కవితాప్రాగల్భ్యముఁ గూర్చి కవిపండితులగు నాంధ్రులకు విదితమే. ఈయమూల్యగ్రంథమునకు, పీఠిక వ్రాయించకుండ ప్రకటించు టాశ్చర్యముగ నుండిన, నుండవచ్చును. పీఠికారచయితలు గ్రంథమందు లేని ఔన్నత్యమును గ్రంథమున కాపాదించి, పొగడుట సహజమైనది. దీనివలన గ్రంథకర్త కదివఱకున్న పేరుకూడ నశించుచున్నది. సహృదయులు ఈగ్రంథమును మొదటనుండి తుదివఱకును చదివి, యిందేమైన నమూల్యభావము లున్న గ్రహింపవేఁడుకోలు.

సోదరునియందలి ప్రేమతో నీఖండకావ్యములనుకూర్చిన విశ్వనాథ సత్యనారాయణగారికి నానమస్కారములు.

ఆధునికసారస్వతమున కనేకవిధముల నధికప్రోత్సాహ మొసంగుచున్న శ్రీ విశ్వదాత, దేశోద్ధారక, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈగ్రంథమును ప్రకటించినందులకు, నేను వారి కనేకవందనములర్పించుచున్నాను.

రామలింగేశ్వరపేట,
తెనాలి.
25-6-34.

ఇట్లు:
పెనుమర్తి
కామేశ్వరరావు.

# పీఠిక

ఏ యనూహ్యక్షణంబుల నెందుచేత
నాఁటినాఁడవో యీతీవ, నాఁటినాఁడు
కొలఁదికొలఁదిగ నీరంబుఁ జిలుకరించి
పెంచుకొంటిని దీని దీవించు దేవ!

నాహృదయహారి ముకుళసంతతులు పుట్టి
పూచియును బూవకున్న విప్రొద్దుపొడుపు
వేళ, సౌరభ్య మంతగా వెలయ దైన
వానిమీఁద నాప్రేమ యపార మగును!

ఈ కొమరుపూలఁ జిదిమి నశింపఁజేయ
నాకు మన సొప్పదయ్య! నీనవ్య లలిత
కంఠసీమ నలంకారకలన నుంచి
ధన్యుఁడ నయ్యెదుపో జీవితంబునందు.

సౌరభములేని పూల నొసంగె దేల?
యని కసరికొట్టెదవయేని యదియె నాకు
మోదకారణ మగును, నీ ముగ్ధవాణి
నవనవానందరసనిధానమవు నీవు!

# ముందుగతి ౧

గడచిపోయిన కాలమే కద్ద మాత్రం
కష్టమో సౌఖ్యమో వది గాంచుకతన
ఆ భవిష్యన్నిలీన రహస్యగర్భ
మెంత బీభత్సమో మనం డెఱుంగినాము ?

గడచిపోయిన దుఃఖమే మనకు నేడు
కొన్ని సౌఖ్యాంబుకంటె సుభోస్మితంబు,
మఱచిపొమ్ము! హృదంచలస్ఫురిత మైన
ఆ భవిష్యదాగామి సౌఖ్యప్రసక్తి.

# స్వేచ్ఛ

పంజరంబున బంధింపఁబడిన శుకికి
యెగురవలె ననుకోరికయే ఘనంబు!
కాలు సేతులు సంకెళ్ల కట్టబడిన
జీవి కెప్పుడు స్వేచ్ఛయే భావగమ్య.

బంధనంబులు వీడి స్వచ్ఛందలీల
నెంత నభిలాషపడుచుంటి నంత కంత
శృంఖలములు తమంత నా చేతుల బడి
కదలనీయవు యిం కేమి గలదు నాకు!

జీవితానందమందు స్వేచ్ఛావిహార
మందుకొనలేని మూకశుకాంగనవలె,
నా హృదయ మిప్డు కశ్మలమోహితమయి
రుద్ధగీతవిపంచి నేరుకొన జూచు.

# సమాశ్వాసము 3

ఒక మనఃక్షోభ మెడఁద సముత్థ మైన
కాల మెటు నిర్గమించునో, కలుషిత మయి
ఆనెడు చింత నిద్రయ రాక యక్షియుగళి
తెరచుకొని శూన్యవీథుల తిరిగి వత్తు.

కష్టములును సౌఖ్యంబు లొక్కటిగ జూచి
అంతరంగము నింపుకొన్నట్టి కాల
నిబిడగహ్వరతామసాన్వితము లైన
భావములు నాకు భయము నుత్పత్తిసేయు.

ఎట్టులో నోర్చుకొను మది యేమి లెక్క!
ఆ హృదయబాధ శమియించినట్టి యుండి,
ఏతరంగమొ వచ్చి తటాతిభూమి
నడుగుజాడల హరియించి గడగి చనును.

కాలచక్రభయంపు చంక్రమణములను
యిట్టిబాధలు వేనవే లింక గలవు
అవి జననపాతమాత్రజీవాంబువీచి
లోలములు చింత తక్కు ముల్లోలహృదయ!

ఆ మహోదధిలోఁ బడి చీమయంత
కూడ చింతయు లేక నికుంజపాళి

నవ్యయానందరసము నోలాడికొనుచు
శిశువు వోలె నుంటివి దయాసింధుమూర్తి !

ఎన్ని జన్మంబు లేగెనో, యెన్ని వచ్చె
నో యెఱుంగను ! దుఃఖవినోది వైన
పరమపదముని సత్యాప్రాంతరమునంగు
బ్రతికియుంటిని చలనసంతతులు లేక.

కనుల ఱెప్పలు వాల్చి నొక్కపరి మూసి
తెఱచినంత సృష్టియు లయం బరసికొందు.

* * * *

కాలు మెట్టుల తిరుగు దుఃఖములు వచ్చు
పోవు జీవిత చక్రము బ్రుంగిపోవు !
ప్రణయ రోచిస్మృతీ మనః పద్మభాగ
సౌరభంబు లమ్లానదాస్యములు లేవు.

పు నెచట దాచుకొంటివి న
భోవనసంచరదధ్వగా! క్షణ
క్షణము భవద్విలాసవిక
చం బగుమానసపుండరీకమం
దున జనవాంతరప్రణయ
దుగ్ధము ద్రావుచు నుంటి ముగ్ధతన్.

ఈ యనంతసృష్టిస్థితి నీయనంత
నవ్యలావణ్య మెంత మానసహారంబు
వత్సరమ్మున కొకక్రొత్తవన్నె నెచట
తెచ్చుకొందువు జలదవీధీశుభాంగి!

# అనుతాపము ౫

ఈపరిణామపంచపు
హేతలి నొక్కయుబస్వాపమే
నాపథ మిప్డు మారినది
నాదగు జీవితకావ్యసూత్రమా
లాపతనంబు క్రొత్తనథ
లై దొలకాడిన విచిత్రమం
తా పరమాత్మ! నిక్కపక
దా! జగదాధిప నీదయేకదా!

అగును చరాచరంబు భవ
దంతరచంక్రమణోత్థపాత్రము
ధ్యాగుడను నీనిరంతరప
థంబున నారథ మెన్ని నాళ్లకేఁ
గఁగలదో? మెన్ని బంధములు
కట్టునో? యేమగునో సమస్తమున్?
జగదధినాధ నీదయ కొ
సంగితి, ఆపయి నాదుభాగ్యమే.

నాయల్పత్వము నీ వెఱుంగుదు మనో
నాథా! విలోలాత్రిజీ

వాయత్తం బయి నీ వొసంగిన మహీ
యఃప్రేమ వర్ధించుచున్
పోయెన్ పీడు, దినాంతకాలసజలాం
భోదంబు గర్జించి న
న్నే యాధారము లేనిగహ్వరములం
దుంకింప నుంకించునో!

హృదయనాథ! జీవితమధు విచ్చిపోయి
నన్ను మత్తునిగాఁగ పొనర్చినావు!
అప్పుడపు డిది జ్ఞప్తియం దరసికొనుచు
వెడఁగు నైపోయి కన్నీటఁ దడిసిపోదు.

# వనప్రియ ౬

చెఱువుగట్టున నామ్రభూమిరుహమందు
గూడుకట్టిన కోయిల కొన్నినాళ్లు
చిగురుసంజల మాధురుల్ చిందిచింది
రసతరంగడోలావిహారములు చేసె.

ఆ మధుమనోజ్ఞకిసలయశ్యామరేఖ
పాడినపికంబు పంచమగీతిలోన
సృష్టిలోని మహాదుఃఖచితులు మండి
చల్లపడిపోవు నంబువర్షమునపోలె.

ఒక్క ప్రాతర్మరుత్తున నున్మిషించి
పికము జేరె విషాదగీతికలు కొన్ని,
వానియావృత్తులందు తద్గానమధువు
కొంచెమేనియు లేక జీర్ణించిపోయె.

కాలము క్రమించె కోయిలగాన మెడలి
మిసమిసలు పోయె నామ్రభూమిజమునుండి
వన్యజీవనమధురచైతన్యకళలు
వాడిపోయె నిదాఘపువేడిలోన.

మోడుగానున్న మామిడిజాడ గాంచి
' ఇచట పికకస్య సుధలు స్రవించిపోయె

ఇచట మాధుర్యవాహిను లింకిపోయె ’
అనుచు స్మరియించుకొనుచుండి రచటిజనులు.

శాంతనిశ్శబ్దశర్వరీచ్ఛాయలందు
వేణుగానము పాడు మందానిలుండు
కొంచె మచట శయించి యాలించి పోవు,
నాదములు దాటి యున్న విషాదగీతి.

ఓ మధుమనోజ్ఞ! నీగళధామమందు
నిలువఁగానిమ్ము! నాచిన్ని తెలుఁగుపాట,
నీవు స్వేచ్ఛాస్రవంతివి, నిండి పొంగి
గట్లు ద్రెంచుకొంటివి మనోఽంగణమునందు!

నాకువలె నీకు దుఃఖబంధములు లేవు.
నాకువలె నీకు బాహ్యచింతలును లేవు
సమధికానందరసరాజ్యరమవు నీవు
పాడుకొనుమమ్మ! కోయిలా! భావపదము!

# తాళీవని ౨

## నేను

ఈ సమున్నత తాళభూమీరుహమ్ము
లే యుగాలనావంటివో—యిపు డనంత
నిశ్చలాస్పందముకుళిత నేత్రములను
తలచుచున్నవి యుగయుగంబులచరిత్ర.

జననదేశమునుండి నిశ్చలత నొంది
పూర్వతాల్యము విస్మృతి పొందినట్టి
జీవులో యేమొ? గాలి వీచినను గాని
పలుకనేపల్కు వీరహాఃప్రణయ మేమొ!

ఈ యుగాంతరజీవు లెన్నెన్నిమార్లు
ఆశలను బెంచుకొనిరో దిగంతములకు
ప్రాఁకలేని యాశల తలపై ధరించి
యిల నిలంబడు శీతోష్ణములు సహించి..

# శ్రావణస్మృతి ర

ఎంత మాధుర్యపరసీమ యీనిశీథి!
విరియపూచిన చంద్రికావీథులందు
సృష్టి, శాంతితశర్వరీ స్మితమనోజ్ఞ
పరమపరమునిమూర్తిలోపల శయించె!

అణువు మొదలు సమస్తభూతాంతరముల
కప్పురపువెన్నెల పిసాళికమ్మదనము
తావులూర నానందచింతావిచలిత
విశ్వజీవనశాంతు లావిర్భవించె.

ఒకటిరెండు మొగిల్లు తద్వ్యోమరంగ
విహరణానందమునఁ బరువెత్తి పోయె
క్షీరసాగరకౌముదీపూరమందు
అమృతధాముఁడు మాధుకుంభములు కురిసె.

విరహావిహ్వలకామినీతరుణిమంబు
ఎంత వాడెరా! యీచంద్రికాంతరమున!
ఎంత ప్రణయామృతంబు వాహినులు కట్టి
ముంచుకొన్నదొ సర్వభూములనుగూడ.

ఈదృశానేకభావోర్మికాదవీయ
మైన హృదయంపుతాపము మ్లాన మొంద
ఒక నిమేషము జీవవాయూద్గమాతి
భీషణశ్రుతి నాకు విన్పింపలేదు!

యౌవనవసంతవీధుల సమ్మృతగీతు
లొలుకుకోయిలచేడ సన్నిలువఁబోకు
నాకుఁగూడ నీవలెనె గానంబు జేయ
నాసపుట్టి నిట్టూర్పుల నణఁగిపోవు!

ఓయి శ్రావణజలద! పోవోయి నీదు
దారి నీ వేగు, మేల నాదైన్య మరసి,
ఒకట శ్రమోగించుమని యందు వురలిపోవు
కన్ను గవలోన నాకు మేఘములు క్రమ్ము.

ఓమహానందమూర్తి! రసోద్గమంబు
నీదుజీవనమాధురీస్వాదుఫణితి,
నను పలుకరించపోకు గానంబు జేయ
నాస పుట్టి కన్నీటిలో యలసిపోదు!

పాలకడలిలో తెలితరంగాలమీద
పాపసెల్లాఁబరుండిన బాలుడ నయి
ఎపుడు పాడితినో జగదీశ్వరుండు
కృతపునఃపునరామోదవృతుఁడు గాగ!

చిన్నితారకఁ జూచి నీజీవభాగ్య
ఫల మని తలంచు నీనిశాభాగమందు
హృదయవిదళన సంస్మరణేంగితములు
తోనుకజేయకు! పుణ్యమాయెనుర మేఘ!

# చీకటి మబ్బులు ౯

ఈ లేత వెన్నెల బాలచంద్రునికి
ప్రవిమలానంద నిర్భరతపఃపూర్తి,
ఈ తారకావళీ నూతనజ్యోతి
శర్వాకీదేవిస్వచ్ఛదరస్మితంబు,

ప్రవహించు సెలయేటి పాటల తేనె
వాయుకాముకునకు వాంఛితసిద్ధి
ఈ మహానందవాహినుల నోలాడి
సృష్టి పడుచుదనంబు చిందిపోయెడిని.

# లోభము ౧౦

అపరసాగరలోలోర్మికాంచలమున
భానునౌకాప్రయాణమాపతిత మయ్యె;
తావికాఁబున లేదు మందానిలుండు
జీవితానందమధువులు చిందుచుండ.

పవలు కృషివృత్తిచేత తాపమును బొంది
జానపదుఁడు స్వకీయసంసారవల్లి
అమృతకౌసుమపరిమళ మల్లుచుండ
చిగురునగవుల తనయిల్లుఁ జేరుకొనియె.

హార్మ్యవీథీవిహారలీలాంచితుఁ డగు
ధనికుఁడును, జీర్ణకుడ్యబంధములు గల్గు
నల్పపుకుటీరవాసియు నమృత మైన
ప్రేమపూరము తనివివోఁ బిదుకుకొనిరి.

# భావతంత్రి ౧౧

సదమలోషః పవిత్ర లాస్యారసంబు
కాలపురుషుని తూలికాకార మొందె
విరిసిపోయెను శర్వరీవీధులందు
యుగసహస్రపుపోగతు లోసరిల్లె!

ఉదయభానుని కిరణాల నిదుర లేచి
పోయెను దిగంతవీధుల పులుగుజేడు.
కన్నుఱెప్పల వాల్చక తెన్ను జూచు
పులుగుపాపల మాధుర్యములు స్రవించె.

ఆ రసాలకిసాలసౌహార్దమధువు
త్రావి పోయినకలకంఠికావదనము
కాలవైపర్యయప్రసంగములు సూచి
తనదు గీతిక తనలోనె దాచుకొనియె.

ఈ మహావిశ్వజీవనగ్రామమందు
కలికి దోబూచు లాడి మాయలు పొనర్చి
నన్ను వెంటాడు మధురగానములకొలకు
గడచుచున్నది సుఖదుఃఖగతులుగూడ.

# సముద్రమునకు నీటిబొట్టు ౧౨

ప్రాచీజృంభిత సాంధ్యరాగముల ని
ష్పన్నంబులౌ కాంతిసా
మీచీనప్రభలందు హేమమణి స
మ్మేళచ్ఛలోత్తాలవీ
చీచాంచల్యము లంద నంత యుగని
శ్రేణీప్రతిధ్వానఘో
షాచైతన్యమయ స్వరూపుడవు! భా
స్వద్దివ్యరత్నాకరా!

తారావీథి ననంతమై మధురము
క్తావల్లు లుద్భేదమై
వారి స్వచ్ఛభవద్ధృదంబుజసమీ
పంబందు ఫేనార్భటీ
తారక్యమ్ములు సౌరభింపగ దిశాం
తవ్యగ్ర గంభీర ఘో
షారావమ్ముల నాట్యమూర్తివగు నీ
సౌందర్య మే మందురా!

ప్రళయఘనాఘనంబుల ర
వన్మురజశ్రుతులందు నాట్యవి

ద్యలు పలికించునీవు జగ
        మందలి ప్రేముడిచేత వేమి ఘో
షలు పొనరించవోయి! యుగ
        సంతతి నీదుగభీరగర్భ వీ
థులఁ బడి నిద్ర వోయినది!
        తొంగలిరెప్పల నోసరిల్లుచున్.

మారాజ్యంబులు మాపురావిభవస
        మ్రాణ్ణిత్యధర్మక్రియా
గారమ్ముల్ నశియించిపోయినవి! రం
        గన్నవ్యలోలోర్మికా
భేరీనాదములన్ ధ్వనించుచు మహా
        ఫేనస్మిత మ్మొల్కుచున్
వరా! సాగర! యేల నవ్వెదవురా!
        యీమూఘలం జూచుచున్.

# సంధ్యాస్మృతి ౧౩

కొందమునెఱసంజలోని కుంకుమమునందు
జీవితాశాఫలంబులు చిదికిపోవు
కర్మయోధుల వీరరక్తములు పొంగి
సంస్మరింతును గడచిన సాంధ్యశోభ.

నా బహుళజన్మ చంక్రమణమ్ములందు
గడచిపోయిన యుగములగాథ లెల్ల
గాఢనిద్రాంతరాళ రంగములయందు
స్వప్నములువోలె వచ్చి యస్తంగమించు.

తెలుగునాటి మందమరుత్తు లాలికినంత
హృదయనాళాంతరమ్ము లూహింపరాని
శతసహస్ర విద్యుద్దీప సంచయముల
వెలిగిపో వేయియేన్గుల బలము నాకు!

పొరలుపొరలుగ మూసుకుపోయియున్న
హృదయపుటములు ఛేదించి యెదిగియున్న
బంధుర తమాలములు తలపై పెకల్చి
ఒకనిమేషము మధురవాయువులు తిరుగు!

ఊహ కందని యుగయుగ వ్యూహములను
దాటివచ్చిన వీరరక్తంపుటలలు
భూనభోంతరవీథుల బుసబుస మని
నా హృదయమందు జీవగానములు మ్రోగు!

# ఆతిథ్యము ౧౪

ఆనిశాకాలశాంత శయ్యలఁ బరుండి
సుఖమధుస్వప్నములు గనుచున్న నేను
నిశ్చలసరస్తరంగ నిర్నిద్రరవము
నాలకించి ద్వారముపొంత కరిగినాను.

సూక్ష్మగతి వచ్చి వడివడి సుళ్లు రేగి
జగము క్రమ్మిన ప్రబల ఝుంఝామరుత్తు
నా కుటీరకవాటబంధన మెడల్చి
కన్నుగవలో పరాగమేఘములు గప్పె.

ఆసమయమందు సకలదిశాంతరాళ
విపుల తామసగహ్వరవీథులందు
నొకటి రెండుచుక్కలు మహావ్యోమవీథి
నుండియును లేకపోయిన నొక్క టయ్యొ!

వికృతహాసకరాళదీంప్రికలు మెఱయ
నీలకైశికకాళిమ మ్మొలగింప
ఒక్కయెడ విస్ఫులింగము లుమిసికొనుచు
తొంగిచూచుచున్నది దుఃఖదేవి!

మొదట చూచిన యంతలో మోద మెడలి
'ఓసి దౌర్భాగ్యురాల! ఆయాస మేల!
ఏమియును లేనినన్ను వరించి వచ్చి
ఏ మనుభవింప వచ్చినా వేమి!' యనగ.

‘ఓయి మోహన! దిశ లెల్ల నొక్కపెట్టు
తిరిగి వచ్చితి నీవంటివపుడు లేడు
నీహృదయవీధి కానవనిత మింత
కరగిపోయిన నేనును కరగిపోదు!’

‘నీవె ప్రేమప్రపూర్ణమందిరమ వోయి!
భగభగనిమండు నాస్వహాసమ్ము కొఱకు
ఎంత మాధుర్యపేటి నీయామనస్సు
దాగుకొనియెద నంతరాంతరములందు.

అబ్ధిగర్భంబులో బడబాగ్ని గలదు!
నేను నీగర్భమందున నిలచిపోదు!
మారుమాటాడవద్దుసుమా! మదీయ
హృదయతృష్ణ శమింపజేసెదవు నీవు!

*

భాష్పబిందూత్కరంబుల పాద్య మిచ్చి
వేడినిట్టూర్పుగాడ్పులు వీవనలుగ
కౌగిట గదించుకొంటి నాకాళరాత్రి,
అంజనాచలవర్షమ్ము లధిక మయ్యె!

# ఎవరు నీవు? ౧౫

ఎవరు నీవు? హృదంబుజ మిటు హరించి
కనఁబడి కనంబడవు! నభోఽంగణమునందు
పులుఁగునై నిన్ను వెదకుచుఁ బోయినాను
దిగ్దిగంతరారామ వీథికలపైన.

మండుటెండల వాడి సొమ్మసిలి పోవు
నాహృదంతరంబున జందనం బలంది
ఏమొ పాడితి గాని నాయీశ్రవణము
లందుకోఁజాల లేక శూన్యత్వ మొందె.

చిమ్మచీకట్లలోన నా చెంత నిలచి
వేణువూదిన యట్టులు గానసుధలు
చల్లినటు లున్న దీస్వప్నసరణి యేమొ,
ఇట్టుల భ్రమింపచేసెద వెవరు నీవు?

# తెలుఁగుపాట ౧౬

౧

తెలుఁగుభూమిలో జన్మించితిని
తెలుఁగు గాడ్పులనే పీల్చితిని
తెలుఁగు నీరములనే త్రాగితిని
తెలుఁగువాఁడ నేను!
సంపద
కలుగువాఁడ నేను!

౨

అలరుతేనెలకు నావలిగట్టిన
కండచక్కెరకుఁ గడవలు పట్టిన
అమృతపుసోనలలో తిరుగాఁడే
తెలుఁగుబాస నాది!
కమ్మని
తెలుఁగుపలుకు నాది!

౩

కత్తితళుకులా యీరెండలచే
మత్తవైరులూ మాయం బయిరీ!
మత్తిలుశత్రుల మర్దించినయా

కత్తి తెలుఁగు నాది !
వెలిఁగే
కమ్రతళుకు నాది !

౪

తెలుఁగుతల్లికై చచ్చిపోయెదను
తెలుఁగుభాష కందిత్తు జీవములు
తెలుఁగు సోదరులె దేవులు నాకూ !
తెలుఁగువాఁడ నేను
సంపద
కలుగువాఁడ నేను !

# మాయూరు ౧౨

అచట వీచెడు మందమందానిలంబు
మలయపర్వతకుహరసీమలకుఁ బోవు!
ఆ పవిత్రములైన దివ్యాంబువులకు
స్వర్ణదీగర్భపావనాంచలము లుండు!

పండి మిలమిలలాడెడు పంటచేలు
తరతరంబుల మాజీవితంబుఁ గాచు
మధురభూమీజషండముల్ మలయశీత
లాంతరసమీరపుంజాయ లాక్రమించు!

దుఃఖములు వేలకొలఁదిగా దొరలనిమ్ము!
జన్మభూమి పవిత్రదేశమునయందు
పొరలు నానందరేఖల వెఱపు పుట్టి
అంటనేయంట వీహృదయాంతరంబు!

# కవిబ్రహ్మ ౧౮

చివురుతేనెకరుల్లు వాసించినవియు
నీతెలుఁగుకైత కమ్మని నిగ్గులందు
వాని గ్రహియింపలేక మా మానసములు
అల్లకల్లోల మందెడు నయ్య! సుకవి!

అదిర! తావకసుకవితా మధువునందు
వేదమే యైన భారతగాథ మ్రోఁగి
కమ్రరత్నంబునకు కనకంబునకును
బొందికలు మూఁగిపోయెనుబో! కవీంద్ర!

అమృతపేశల మైననీ విమలకవితఁ
ద్రావి సంజాత మాకరందస్రవంతి
నోలలాడఁగఁ బూర్వజన్మాల పుణ్య
మెల్ల మారూపు నొందె నీ కేమనందు!

అదిగో మాకు వినంబడు నయ్య! ధర్మ
రాజుపావిత్ర్యగీతి, వీరాతివీర
విజయగాండీవరణిత మౌర్వీస్వనంబు
పెన్నతరఁగల పాటలవెన్నలోన!

# నిర్వేదము ౧౬

ఈ విశాలజగత్తులో నే నొకండ
దుఃఖజీవిగఁ గన్పట్టుదునుర నాథ!
గాఢకల్లోలజలధిఁ జుక్కాని లేని
పడవ నైపోయె నోయి నాపాడుబ్రతుకు!

గాలి యెటు వీవ నటువైపు కదలు నౌక
ఈ విలయఘూర్ణితోర్ముల, నీ ప్రభంజ
నోగ్రనాట్యాల నాజీవనోదయంబు
వ్య్ర్య లగునేమొ రక్షించువారు లేక!

దాఁటవలసిన దీసముద్రమున నింక
నెంత యేనియుఁ గలదు, నే నెట్లు పోదు?
కాలు సేతులు వణకు దుఃఖములు క్రమ్మి
ఈ మహాంధలోకములు న న్నీడ్చివైచు.

అమృతదివ్యము లైన నీయక్షియుగ్మ
దివ్య తేజస్స్రవంతుల తేలిపోయి
నాదు జీవనభాండ మేనాడు నీదు
పాదయుగమందు నుంతునో! స్వాదుమూర్తి!

# శైశవస్మృతి ౨౦

ఆడుకొన్నాము! సహజసౌహార్దసరణిఁ
బాడుకొన్నాము! నైర్మల్యభావఫణితిఁ
జూచుచుండఁగ నిది యేమి చోద్య మగునొ?
శైశవమ! వీడిపోదువా! శంపవోలె.

ప్రకృతిమాధుర్యరసమును బంచిపెట్టు
జలధరవసాన రమణీయసాంధ్యదేవి
దాచుకొన్నది తనదు చేతస్సునందు
మన యమూల్యసుహృద్భావమంజరులను.

మావిపిందెలవగరు కమ్మందనంబు
మాదు జిహ్వాక సంవత్సరాదిముంద
అనుభవించిన దార! నీ నెనరుకలిమి.

ఐహికస్వర్గ రాజ్యమా! అతులితముగ
నీ మధురవీక్షణార్చిరానీత మైన
సత్కృపారేఖ నప్పుడే సడలఁజేసి
దుఃఖపుతరంగలం దేలఁ దూఁగఁ జేతు?

అపుడు నా కున్న హృదయప్రహర్షరోచి
నేఁడు కనుఁగవపొంత నిర్నిద్రభావ

పల్లవంబుల శోభల నల్లుకొనుచు
మఱపు రాకున్నయది నిరంతరముగాఁ.

చివురుచేతుల మవ్వముల్ గవియుచుండఁ
గాల్లచిఱుగజ్జియల ఝణత్కార మొదవ
మాయ నెఱఁగనినా పూర్వప్రాయమందు
నాటలాడితిఁ దన్మయతాంచితముగ.

శైశవస్మృతి మెడఁదలో సంచరింపఁ
జింత లెల్లను మ్రగ్గినా యంతరాత్మ
ఓసి యిహలోకదివమ! నన్బాసినావె?
నా మనోఽనందముల నెల్ల నాఁచికొనుచు..

మా సరోవరతటమున మలయుపిల్ల
గాడ్పుటలలకు ముంగురుల్ కదలుచుండ
కాగితంపునౌకలఁ దరంగాల విడిచి
అవి చలింపగ నానంద మందినాము !

శ్రావణాంభోద మంజునభోవిటంక
మును గనుంగొన హర్షంబు ముమ్మరింప
నొలయు తెమ్మెర కెరటాల నోలలాడి
సేతుబంధన రచనంబుఁ జేసినాము !

నాఁటి యానందకలనము, నాఁటి మధుర
క్రీడలందునఁ దొలకాడు ప్రౌఢతనము

నేఁడు సంస్మృతిమాత్రాన నింపుఁగనుల
హర్ష సూచిత కోష్ణబాష్పాంకురములు !

ఆ మహానందరాజ్య మెట్లధిగమింతు ?
ఆ మహత్తరసౌఖ్య మెట్లనుభవింతు ?
పోయినది! యింక రాదు-కాబోలు నౌర !
అమృతఖండము దేవతాత్మమున కిల్లు.

అతితరగభీర మైన భవాబ్ధియందు
సౌఖ్యమయకూలనామ శైశవము దాఁటి
పార మంటని యాగురువారిరాశి
మధ్యమునఁ జిక్కు-దును బోలు! మగుడలేక.

దుఃఖతుంగతరంగదోదూయమాన
మీ భవాంబుధి దీనిఁ దరించు టెట్లు?
ఓ జగద్రక్షకా! భవదుజ్జ్వలతర
సత్కృపాప్లవ మంపి న న్సాకు మయ్య !

# ప్రేమజ్యోత్స్న ౨౦

ఓ సుధావాహినీ! యిట నొడ్డు తాఁకి
పొంగిపోవు సౌందర్యతరంగమాల!
ఆ కనులలోనె యున్నది, అమృతకోటి
కందుకోలేని దివ్యప్రేమామృతంబు.

ఓ విరియ పూచుకొన్న క్రొమ్మావి లేఁత
పసరుటాకుంబసందుల మిసిమి! తేనె
కెరటములఁ దేలియాడు క్రొవ్విరి! మునింగి
పోదు నీలోన మేల్కొల్పఁబోకు నన్ను!
ఓ యమృతవాహినీ!............

## ఓం ౨౨

నేను దైవాంశవలన జన్మించితి నని
నా యపారతపోబలమే యనంత
రత్నముల పెల్లగించునో,......
ప్రజ్వలించి
యేయనంత నక్షత్రము లేల గలదా!

నాకభువనమ్ములోని మన్మధసహస్ర
జీవనాధార, నవనవోత్సేక యౌవ
నోదయోన్మత్త,- యే జగన్మోహనాంగి
నా కనుగెలంకులందు చంచలలు తిరుగు,
భావనాకాశవీధికఁ బట్టువడునో!

*

అని భయంపడి నా జీవితాధ్వ మెల్ల
కంటకితగూఢముగ జేసి కనులు లేని
భావమూర్తిని పెడత్రోవ లావరించి
నే కలవరించు నమృతమాణిక్యదీప్తి
నీలనీలాంబుదములలో నిహ్నవించి
ఎవ్వ రీశంకితమనస్కుఁ డెవ్వ రితఁడు!
బాట కడ్డముగా పడి పలుకబోడు!
యామినీమార్గమున శోక మాక్రమించు

నా నిరాశాతపస్విని కాతిధేయ
మొసఁగు సుముహూర్తమందున నోసరిల్లు.

ఆశలు వెలింగి చైతన్య మావరించి
భానవీయజ్యోతిష్పరంపరలలోన
మరల పయనమ్ము గట్టునా మార్గమునకు
ఎవ్వా రీశంకితమనస్కుఁ డెవ్వ రితఁడు—
అడ్డుపడి, సాగనీఁడొక్క అడుగుగూడ.

# పొద ౨౩

౧

నా చెలిమికాఁ డొకండు మానవజగత్తు
లోన జన్మించి కఱకుఱంపాన లేఁత
కోర్కెలయెడందలో తెగఁగోసివేయు
విధికి లొంగి యీబ్రతుకునే వదలినాఁడు!
ఎన్నినాళులో గడచిన దీవిషాద
వృత్త మిటు సంభవించి, జీవితపుమాయ
మత్తిలిననాకు నెచ్చెలిమాట గూర్చి
ఒక్క స్మృతిగాని, తలఁపేని చిక్క లేదు.

౨

నేఁ డకస్మాత్తుగా దారినే గమించు
నాకు చెలికాఁడు ప్రత్యక్షమై కనఁబడె.
ఆతఁ డాదారిప్రక్క భయంకరంపు
ముండు లెద నాటుకొని నిలుచుండె, నతని
హృదయరక్తంపుబిందువు లొదిగి యొదిగి
సలసల జ్వలించుచున్నవి సవితృకాంతి.

౩

అతఁడు నేఁ డొక కంటకావృత వికీర్ణ
మైన పొదరూపమున జన్మ మందినాడు!

# ప్రార్థన ౨౮

మధురతాసీమ మైన యీ మల్లెపూవు
నందు మమకార, మంతు లేనట్టి తృష్ణ
నాకుఁ గల్పించు నిది సుగంధములు పోయి
వాడిపోవురా! యని చెప్పవద్దు నీవు!

దాని యంతఃపరిమళ శ్రీనిధాన
మందు కదలద నాయాత్మ, స్యందమాన
మధుపిబన్ముగ్ధషట్పదీమంజుగీతి
తోడ దాని సతంబు నుతుల్ పొనర్తు!

అది వికాసము నేదున యన్మ! దాని
లోని ప్రేమ ప్రదీప సంధ్యాసవారు
ణాధికమనోజ్ఞ భర్మహర్మ్యములయందు
గాలు కదపదే! హృదయము కాంక్ష లూరి!

# కవితా ప్రణయిని ౨౫

నా సర్వస్వము నీ కొసంగెదను గాం
తా ! మంజులాపాంగవీ
క్షాసౌదామిని యైన నీనయనశ
శ్వద్రాగమాధుర్యడో
లాసాంగత్యము జన్మజన్మలకుఁ దే
లంజేయుతన్ నన్ను, నీ
తో సల్లాపము లాడుటే పనిగ మృ
త్యుద్వారముల్ దాఁటియున్.

ప్రాతర్మరుదూర్మికాచయము వా
సించెన్ భవత్సౌరభ
శ్రీప్రీతుండయి యీకిశోరకవి మ
ల్లీవల్లరుల్ తెచ్చి, దే
వీ! ప్రేమప్రమదాశ్రుసేచనము గా
వించెన్ భవత్కంఠవీ
థీప్రేమోదయరాగమంజరుల శాం
తిం బొందు కాంక్షాలతన్.

ఎంతటి భాగ్యమూర్తివి? జ
నించిన దాదిగ నీమనోజ్ఞతా

దంతురితంబమై, విలయ
దాహము ప్రేల్మిడిఁ జూచునీకవి
స్వాంతము నెంత కర్కశపు
చాయల దిద్దితి వోర ! నాదాజ
న్మాంతరవేళ నీసొబగు
లందలి కమ్మఁదనంబు పేర్చుతఁ !

నిందావాక్యములో, ప్రశంసములో క
ల్పించెఁ భవగ్గీతవే
ణిం, దైవారిన నాదుమానసము శాం
తిం బొందుఁ గల్లోలమా
లాందోళాంకితవార్ధి ఘోషముల నో
య్యం దాఁటి, యే రేఖప
ల్కం దొల్కాడద కోపభావము మనో
లావణ్యముగ్ధాకృతీ !

# కాళిదాసు ౨౬

ఏ శుభోదయవేళ నీయీ విపంచి
గీతులు స్రవించినదియొ ? రాగిల్లినవియు,
మా మనఃపాత్రికలయందు మధుకణములు
తీయఁదనములు పాడు గీతికలు లేవు.

ఏ రసాలాగ్రవీథిక నివురుపెట్టి
మ్రోఁగినదొ నీదు గీతికారాగమధువు
రామగిర్యాశ్రమమున రారాజభటుఁడు
నిన్ను నమ్మి యూహావీథి నిలిచినాఁడు !

ఈ యరణ్యౌకసులస్నేహ మింతవరకు
తెచ్చినది మాకుఁ గన్నీరు తేపతేప
నీదయాలోచనంబులు మేదురిల్లి
అశ్రువిలయవర్షానమయములు తోఁచు.

మ్లానకుంతల భర్తృవిమానిత యయి
స్వీయబంధులచేత దూషింపఁబడియె
నా నిరాశావిలుస్తదృగంచలముల
మూఁడులోకాల నేడ్పించుప్రోడ వీవు !

ప్రణయవారిధికల్లోలఘణితిఁ దేలి
నీదుగీతము రోదసీవీథి నిండె
ఈ యశఃకాయమును భజియించి మేము
పుణ్యులము నిన్ను విన్నచో పులకరింపు.

# చలి ౨౭

శీతలానిలములు వీచెను గదోయి!
నాతనూలతఁ గంపమునందఁ ద్రోసి
ఎచట గడియించుకొన్నవో యీయుదగ్ర
    యాతనాస్ఫీతములు నను నాగ్రహించు.

ఈమహాంధతమమ్మున కిదియుఁ దోడు
అగ్నియును వాయువును బోలె నఖిలజగము
నిద్వయముఁగూడి దహియించునేమొ యనెడు
    భీతిచే నాదుహృదయము కాతరిల్లు.

ఈచలిలేని తావుకొఱ
    కేఁ దిరుగాడితి నీజగంబునన్
జూచినఁ జూచినన్ మనము
    సూదులఁ గ్రుచ్చినయట్టులయ్యె, లే
దా! చలి లేనితావని యు
    దగ్రమహాగ్రహమూర్తి, నేను నా
యీచలి యున్నతావునన
    యిప్డు నిలంబడినాఁడ ధీరుఁడన్.

# క్రీడ ౨౭

ఈమహాభ్రసౌధంబున నే నొకండ
తెగెడుతంత్రులతోడనే తివిచిపట్టి
నానదించు వీణారవగానమహిమ
పూఁతవెట్టెదు నోయి! ఆశాతలములు.

ఆ మహాత్తరగానము లల్లునపుడు
నాదు హృదయము తారకావీథి కింకఁ
బైన నొదిగి స్వర్గమహీజసూనమధువుఁ
గుడువఁబెట్టును నానంద మొదిగికొనఁగ.

నాదు కన్నీటిధారల నీదిగంత
భూములను ముంచి తేల్పెదఁబో! తదీయ
వారిపావిత్ర్యధార భూవలయమునకు
నా యొసంగిన దానాంబునదులు సుమ్ము!

# కృష్ణవేణి ౨౯

ఏ యనూహ్యయుగంబుల నీవు తెల్గు
నెత్తురుల వెచ్చఁదనములు చేర్చినావో ?
నీ గభీరమూర్తినిఁ గన్న నేఁడు నాకుఁ
దెలుఁగు తెలుఁ గను సమున్నతగీతులు పదింతు.

కాలము దాఁటి దిక్కులను
గ్రమ్మిన నూత్నకళామరీచికల్
నీలములైన యంబుదవ
సీతలవీథుల దాఁగియుండి, నీ
లాలితవీచికాస్వనము
లం ధ్వనియించినఁగూడ, నజ్ఞతా
లోలుర మేము తన్మధుర
లోలుపవృత్తులు కానఁజాలముఁ.

ఈ మహాగ్రీష్మమూర్తి దహించు మమ్ము
నీ మనోహరశైతల్యనిభృతవీథిఁ
దల్లి ! దివిషన్నదీసుధాంతఃపవిత్ర
కలశ మందిన పులకరింపులును మాకు.

నీ కృపావాహినీసేకంబులందుస
జనియించినార మస్మచ్ఛరీర

రూపంబు నీకడనే పాలు ద్రాపి పో
షింపఁగాఁబడినది చిన్ననాఁడు
ఓదయాదేవతా! యుదరాభరాత్రిలో
మఱచిపోయితిమి నీమధురిమములు
జీవనసంధ్యలోఁ జెదికిపోయిన నాదు
భౌతికశారీరపరివృతాస్థి
సంచయంబులు నీసుధాప్రాంచితంబు
వేణికలలోన దాఁగుఁ దల్లీ! నవీన
సంతమసజాలములు మముఁ జదిపివైచి
నీపదధ్యాననియతులఁ ద్రోపువెట్టు.

# పద్యాలు 30

ఎచట జనియించినారలో యెవ్వఁ డెఱుఁగు?
నా కలమునందు ప్రవహించినారు మీరు
నేఁడు దందహ్యామానవహ్నికలు మిమ్ము
నావరించును విశ్రాంతి నందుకొనుఁడు!

కాలపురుషుండు బ్రహ్మాండగర్భమందు
నవ్యమోహనమౌ పరిణామగీతిఁ
పాడుచున్నాఁడు విశ్వగర్భమునయందుఁ
బొందు కనరాక లీనమై పోదు మీరు!

అభము శుభము నెఱుంగని యట్టినాఁడె
వలచి వచ్చిరి తూలికాంచలముఁ గూర్చి
ఆడుకొన్నాను నైజసౌహార్దగతుల
పొందు కనరాక మాయమై పోదు మీరు!

# విశ్వకల్యాణము ౩౧

క్రొత్తతావిపసందు లొత్తుకొన్నవి బలే!
నెఱమల్లె తీవపందిరులయందు,
చిఱుతకోయిల భుజించిన కిసాలయములో
స్వాతంత్ర్యరాగముల్ సందడించె,
ఒలికించుకొన్నవి సెలలరాగంబులు
వనలక్ష్మిప్రేమవాసనలు కొన్ని
మాధుర్యవాహినీ మసృణవీచికలలోఁ
గవికిశోరుల గీతరవము మొరసె,
లాజలుగఁ బూలఁ దీవయిల్లాండ్రు చల్ల
మాధవుఁడు వచ్చినాఁడు, బంభరకుమారి
కా మనోహరరాగమార్గములయందుఁ
దేనెలు కరుల్లు కట్టి చిందించుకొనియె.

విశ్వవాణీనవ్యవీణారవంబులు
శాంత్యాశ్రమంబులో సందడించె
సత్యాగ్రహవ్రతాచరణంబు లుర్వరా
పారతంత్ర్యంబును బారఁద్రోలె
భారతీదేవిసంస్మేరరోచిస్సులోఁ
గల్యాణరాగముల్ గ్రమ్ముకొనియె.

హృదయవిపంచికాముదితగీతములలోఁ
ప్రణయవాహిస్యంబుకణము లొలికెః
విశ్వరంగము చైతన్యవిస్తృత మయి
నవనవోన్మేషబృందావనంబునందు
బాలగోపాలు వేణుగీతాలలోన
సన్వయముఁ జేసుకొన్నది హర్ష రేఖ.

లేడికన్నియ ముద్దులాడు శార్దూలంబు
నెనలేని ప్రేమంబు పెనచికొనియె.
మత్తవారణమును మర్యాదగాఁ జూచెఁ
దత్కుంభపిశితసక్తమృగరాజు
ఎలుకపిల్లకు ముద్దు లిచ్చు మార్జాలంబు
కలకుగోళ్లుల ప్రేమ విరిసికొనియె
పావురంబును డేగ ప్రబలమత్సర మీఁగి
నీడంబులందుఁ దూగాడుచుండె
విశ్వకల్యాణగీతికావృత్తిలోన
మ్రోగుచున్నది సుకృతారాగగరిమ
అదిగో! ఉదయాస్తమయములయందె వెలుగు
బాలభాస్వంతురోచిరుద్వేలదీప్తి.

మార్గమునఁ బోవుచున్నారు, మధుర మైన
కంఠరవమున గీతముల్ కందళింప

నప్సరఃకన్యకాళి నృత్యములలోనఁ
గ్రొత్తతనపు గీతంబులు కొసరుకొనియె.

ఆత్మకుసుమము లర్పించునట్టివారి
వదనములయందు హర్షంబు లొదిగికొనుచు
మృత్యుదేవీభయంకరనృత్యములను
లెక్క చేయుటయే లేదులే! పసందు!

# సంవత్సరాది ౩౨

శాఖవీథుల నేవియో వినఁగనయ్యెఁ
గలకలాలాపవిహగగీతు లవి యేమొ?
చివురుచివురున నేవియో చిన్నె లొలసె
మధురిమానందరేఖికాసుధలో యేమొ?
కొమ్మకొమ్మను నేదియో కమ్మఁదనము
క్రొత్త తావిపసందులఁ గ్రుమ్మరించె.

చక్కఁదనములసామి వసంతరాజు
ఆలపించెడు పులుగురాగాలలోన
నేమొ? అమృతవారాశిలో నింత యనుచుఁ
జెప్పలేని కమ్మఁదనాలు చిప్పిలినవి.

అణువు మొదలు సమస్తబ్రహ్మాండమెల్ల
విశ్వనర్తనలీలానవీనఫణితు
లందు పరిణామగీతుల నాలపించె.

రాతిబండమాటునఁ బుష్ప గీతి వాడె
విశ్వసంరక్షకునిమీఁద విమలగతుల,
పోవుచున్నాము! దేవుని దేవళమున
కెప్డు డీయాత్ర సఫలమై యెసఁగునొక్కొ!

## సెలయేరు 33

నన్ను బంధించు ప్రకృతిబంధములు లేవు
ఏమహీధ్రకూటంబులనో మనోజ్ఞ
గానములఁ జిమ్ముచును దరంగాలతోడ
నాడుకొందును నాకు నేఁ దోడు నగుచు.

సూటిగాఁ బోవవలె నన్నమాట యేల?
పోవుచుందు యథేచ్ఛతో, పోయిపోయి
పాడుకొనుచుందుఁ గమ్మనిపాట లెల్ల
గణయతిప్రాసలక్షణాంకములు లేక.

నన్ను బంధించు ప్రకృతిబంధములు లేవు
ఏమహీధ్రకూటంబులనో మనోజ్ఞ
గానములఁ జిమ్ముచును దరంగాలతోడ
నాడుకొందును నాకు నేఁ దోడు నగుచు.

# కోయిల ౩౮

పాడుకొనుమమ్మ! కోయిలా! పాడుకొనుము!
చివురుటాకు సొబంగులఁ జిదుముకొనుచు
ఆమ్రవాటికాశాఖికాభ్యంతరమున
రసవదాలాపరాగపూరములు గ్రమ్మ.

నాకువలె నీకు దుఃఖబంధములు లేవు
నాకువలె నీకు బాహ్యచింతలును లేవు
సమధికానందరసరాజ్యరమవు నీవు
పాడుకొనుమమ్మ! కోయిలా! పాడుకొనుము!

* * *

ఏ చివురుటాకుపొదలనో, యే లతాగ్ర
సీమలందునో చివురులు చిదిమి మెసవి
మానవాతీత సౌహార్దమర్మగీతిఁ
బాడుకొనుమమ్మ! కోయిలా! పాడుకొనుము!

నాకువలె నీకు బాహ్యచింతలును లేవు
నాకువలె నీకు దుఃఖబంధములు లేవు
సమధికానందరసరాజ్యరమవు నీవు
పాడుకొనుమమ్మ! కోయిలా! పాడుకొనుము!

నన్నుఁ గొని పొమ్మ! నీదుగానంపుపథిని
వత్తు నిదిగో! శారీరకపక్షయుగళి

నెగురఁజ్వాలన, భావనామృదురథంబు
నడపెద ననంతమధురగానముల త్రోవ.

నన్నుఁ గ్రమ్మిన బాహ్యాబంధము లెడల్చి
మ్రోఁగుచున్నది నీగీత ముగ్ధరవము
ఎగిరి వత్తునులే! యుగవిగమవేళ
నిన్నుఁగూడి మాధుర్యముల్ నింపుకొఱకు.

ఓ మధుమనోజ్ఞ! నీగళధామమందు
నిలువఁగానిమ్ము నా చిన్ని తెలుఁగు పాట
నీవు స్వేచ్ఛాస్రవంతివి, నిండి పొంగి
గట్లు త్రెంచుకొంటివి మనోఽంగణమునందు.

నాకువలె నీకు దుఃఖబంధములు లేవు
నాకువలె నీకు బాహ్యాచింతలును లేవు
సమధికానంద రసరాజ్యరమవు నీవు
పాడుకొను మమ్మ! కోయిలా! భావగీతి.

# గమ్యస్థానము ౩౪

౧

ఇది పృథఙ్మార్గగామి యై యెట్టకేని
చేరుకొనునయ్య! నీపదాంభోరుహములు.

౨

ఈ పికంబు పాడెడు గీతు లెల్ల నీదు
ప్రణయరాజ్యపీఠికపైనఁ గనును తావు.

# నీవు పైన - నే నిక్రింద! ౩౬

౧

ఆ హిమవన్నగాయతశి
ఖాగ్రములందున సేవకావళీ
వ్యాహృతు లాదివస్తుతిస
భాంతర తాండవప్రదప్సరోఽంగనా
మోహనకింకిణీనినద
ముల్ వినిపింపఁగ నేకమూర్తివై
ఊహలు లేని నిర్గుణమ
హావలయం బయినాఁడ వీశ్వరా!

ఆశావీథుల దివ్యదర్శనము లు
ద్యల్లోకబంధుప్రభా
వేశంబుల్ త్రుటి సేయు నిర్గుణపరా
వృత్తిన్ జగజ్జాల మా
దేశించున్ భవదీయశాసనము కా
దే! తోఁచువో నన్ను ప్రా
చీశైలాంతరరాగరక్తిమల వి
శ్వేశా! కృపాసాగరా!

౨

నీపదయుగ్మ మంటియుఁ బు
నీతుఁడ నయ్యెదు కాంతు నీహిమ

వ్యాపృతకర్మ శాశ్వములఁ
బైఁబడుచుఁ మరి లేచుచుఁ క్షుధా
దీపితమైన నాతనువు
తేజము నేది చలింప నీపద
శ్రీ పులకించు తేజములఁ
జెంత నిలంబడలేన యీశ్వరా!

నీకడ దుర్నిరీక్ష్య మగు
నీరుచి నోరువలేన, నీపద
శ్రీకమనీయతల్ హృదయ
సీమ గ్రహింపఁగ నాదు కాంక్ష యెం
తో కల దేమి సేతు! పరి
ధూసరమామకగాత్రయష్టి నీ
పైఁ కొని తెచ్చితిన్ గొను మ
హాప్రభు! ఇంతియ చాలు ధన్యుఁడన్.

నీ వాతుంగమహీధ్రకూటములపై,
నే నీయధోలోకమం
దే వాగుచు కూరుచుంటిఁ గని తం
డ్రీ! నవ్వఁగాఁ బోకు నీ
సేవాధీనత నున్న నామనములోఁ
జేరున్ నిరాశాకళల్
నీవే యిట్లొనరింపఁ బ్రాత మెవఁ డే
నిన్ బ్రోచు నా దీనునిన్.

## కవి ౩౭

భావవీచిక లెడనెడ నావరింపఁ
గౌముదీధౌత శర్వరీగర్భమందుఁ
గలితమాధుర్యరససముజ్జ్వలము లైన
ప్రణయగీతాలు హాయిగాఁ బాడు మోయి!

చిలికింపుమోయి! ఆశీవిషజిహ్వాలో
మీసరం బైన పీయూషలహరి,
నొలికింపవోయి! వియోగభాష్పములలో
నానందసిక్తమౌ యశ్రువారి,
పలికింపుమా! కిరాతుల మనోవీథిలో
నవఘృణాసించితానందగీతి,
సాధింపుమోయి! పాషాణకర్కశతలో
మంజులతరపుష్పమార్దవంబు,
కలితభావతరంగమై యులయునెడఁద
దాఁగికొని యున్న యశ్రుతరాగగరిమ
కమ్మఁదనము పిసాళించుకవితఁ బాడి
ప్రకృతి నానందడోలి నూపంగదోయి!

## సరీక్షణము 3ర

తళుకు వెన్నెల నవ్వు కురిసే
జలజవైరిని కారు గ్రమ్మిన
నల్లమబ్బులు చిమ్మచీకటు
లల్లుకొని పోయెన్!

లేత కెరటాలందు చిక్కన
పూతపెట్టె కొండవాగులు,
మండుటెండల తాళజాలక
ఎండిపోయినవి!

ప్రణయ మోహన పారవశ్యపు
ఫణితు లేరి నదించుకొనగా
వీణె, తంత్రులు తుత్తునియలై
విరిగిపోయినది!

కాలపురుషుని నృత్య మదిరా!
ఆలకించుచు నుంటి దిక్కుల
కాలు సేతులు మోకరిల బడి
కాచుకొని యుంటిన్!

# సముద్రము ౩౯

ఓ ! లయోత్తుంగభంగనాట్యోదయముల
ఘూర్ణమానవారాన్నిధి క్రుద్ధుఁ డయ్యె,
నన్ను గ్రసియింప వేయిదంష్ట్రలను జూచి
వేచియున్నాఁడు తనపొట్ట వేసికొనఁగ !

ఎందు కేమి భయంబు ! నేనే స్వయముగ
వెళ్లి మునిఁగెద వార్ధిగంభీరవీథి
ఎఱుఁగనా యేమి ? సాగరాంతరమునందు
విమల నైశ్చల్య శాంతిగీతములు మ్రోయు.

# అతఁడు ముందు! ౪౦

ప్రశ్న

ఇరు లలముకొన్న విపినబంధురపథాల
నొంటరిగ నెచ్చటకుఁ బోవుచుంటి వోయి!
చూడ్కి హరియించు నీతమస్సున, జ్వాలన్మ
ణీనవీనరోచిస్సు లేవేనిఁ గలవా?
అతి భయంకర వ్యాఘ్రసంతతుల గర్జ
లవె వినంబడు హృదయశల్యములు తాఁకి,
గుండె లవియించి నీకొండకోన లెట్లు
దాఁటెదవొ యేమొ? ప్రాణాలబైట పడెదో?

నేను

నే నొకండన కాదు, మణికిరీట
ధారి యాపుణ్యమూర్తి పథంబు ముందు,
ఆ యనంత తేజోరాశి ననుగమింతు
దుర్నిరీక్ష్యరోచిస్సంతతుల వెనుబడి.
అతఁడు ముందు! నే నాతని ననుసరింతు
ఛాయపోలె, శర్వరియును, చంద్రుడు బలె
అతని మురళీరవోద్గత గతులలోన
నాదు కంఠస్వనంబు వెన్నాడి యుండు.
అతని పద మంటి నాపద మరుగుచుండు
అతనిదీప్తుల నాకాంతి కుతుక మొందు,
అతఁడు ముందు నే నాతని ననుగమింతు
ఛాయపోలె, శర్వరియును జంద్రుఁడుబలె!

## జోలపాట ౪౧

ఏడువకురా తండ్రి
ఏడువకురా!
లోకాలు మూటిలో
నీకన్న పెద్దెవరు?
ఏడువకురా తండ్రి!
ఏడువకురా!

నీ చిన్నినవ్వులో
నిగ్గు తేలే రేక
పదునాల్గుజగములకు
ప్రాణ మిచ్చేనురా!
ఏడువకురా తండ్రి!
ఏడువకురా!

నీ ముద్దుమోములో
నిద్ర బొందినయంత
తన్మయత్వమున యీ
ధరణి నర్తించేను
ఏడువకురా తండ్రి
ఏడువకురా!

## విప్రవీరుఁడు ౪౨

౧

కరమునందు సితాసి భాసిల్ల
నుపపరాక్రమ మాత్మ నొలయఁగ
కదన మొనరింపంగ వెడలెను
ఖడ్గతిక్కన్న!

౨

ఇరుకెలంకుల యోధనిచయము
వరుసగా స్తోత్రములు సేయుచుఁ
బరఁగుచుండఁగ ఖడ్గతిక్కన
-కరము భాసిలెను!

౩

కదనరంగము భీకరం బయి
క్రాలుచుండ నరాతిసేనలు
వరుసఁ దీరిచి, తనరుచుండి ర
-వార్యశౌర్యమున!

౪

సమరదుందుభి మ్రోసె నొక్కట,
సరసఁగల విహంగప్రతానము,

దుందుభిధ్వానమ్ము విని భీ
తిం దనర్చఁగను !

౫

ఖడ్గతిక్కన, కత్తిఁ జేఁగొని
కాలు ద్రోలికి నంపుచుండెను!
సమదవారణనిచయపరివృత
శాత్రవోత్కరమూ!

౬

సమరక్ష్మాతలి పీన్గుపెంటల
సమదశాత్రవరక్తధారలఁ
గనుట కెంతయొ! భీతి గొల్పుచుఁ
దనరుచూ నుండె!

౭

శాత్రవుల బాణాగ్నిరోచుల
విప్రవీరుని సేన యంతయు
మాఁడిపోవుచు నుండె! మిడుతలు
-మాఁడిపోవుగతిన్.

౮

సేన నంతయుఁ గోలుపోవుచుఁ
జిన్నవోయెను! ఖడ్గతిక్కన

విరతదీప్తుల సంధ్యఁ బరఁగెడి
-ఖరకరునిపగిదిన్.

౧౦

అంతఁ డిక్కున నెఱ్ఱఁబారిన
యానసంబునఁ గారు, ఘర్మజ
లంబులం జేలాంచలంబునఁ
-దుడుచుకొని మగుడన్.

౧౧

వీరరస మొద వెల్లి విరియఁగ
భీరతం గదనం బొనర్చెను!
భారతీయుల వేఁడినెత్తురు
-నాళములఁ బాఱన్.

౧౨

శత్రువీరుల నెల్ల జంపుచు
నెత్తురీరుల పాఱఁ జేసెను!
కాని, యొక్కం డేమి సేయం
-గలఁడు శాత్రవులన్.

౧౩

అంత, పిన్నమనాయఁ డనియెను!
"ఆఁపు మయ్యా! సమర మిప్పటి-

కటుపిదప, సైన్యంబుఁ గూర్చుక
-నరయ రావచ్చున్.

౧౪

అంత వీరుం డాత్మగతమున
“ అక్కటకట ! యి దేటి శౌర్యము !
ఆహవంబునఁ బాఱిపోవుట !
-అతులహేయం బౌ !

౧౫

దారిలోపల నతనిఁ గాంచిన
వార లెల్లరు, ఖడ్గతిక్కన
భీరుఁ డైనాఁ డంచు, హేళన
-సేయ మొదలిడిరీ !

౧౬

సమరభీకరుఁ డైన తిక్కన
సకలమానవులును, హసింపఁగ,
మాఱు పలుకక యూరకుండెను
-కాలబద్ధుం డై !

౧౭

కడ కతని సహధర్మచారిణి
పడఁతికింబలె మజ్జనమునకు

పసుపుముద్దయు నులకమంచముఁ
-బెట్టి హసియించెన్.

౨౦

వేదకాలమునుండి యుండిన
వీరు లాయాంధ్రులకులంబున,
జనన మొందిన, విప్రవీరుఁడు!
శౌర్య ముప్పతిల!

౨౧

వారు లెల్లరుఁ దన్నుఁ బలికిన
పలుకు లన్నియు ములుకు లౌచును
బాధఁ బెట్టఁగఁ భోజనమ్మును
-బాసి కరమందున్.

౨౨

భానుకోటి ప్రభాపరీవృత
మైన కౌశేయము ధరించుక,
బయలువెడలెను సమరభూమికి,
భటులు కొల్వంగ!

౨3

అంత శాత్రవసంచయమ్ముల
నంతకునిఁ గొనగీ టడంచుచు,

చండభాస్కరుఁ బోలుచుండెను!
-శాత్రవావళికిన్.

౨౪

విప్రవీరుని గీటడంపఁగ
వినుతయశుఁ డా బ్రహ్మరుద్రుఁడు
సితకుఠారముఁ గేల నూఁదుక
చెలఁగె శౌర్యమున!

౨౫

సమదవారణయుగళిపగిదిన్
భయదకంఠీరవములట్టుల
విప్రవీరుఁడు బ్రహ్మరుద్రుఁడు
-వేడ్కఁ బోరి రాగిన్.

౨౬

అంతరిక్షమ్మున సుపర్వులు
అనుపమం బైనట్టి యాలము,
గనుచు విస్మయసంభ్రమంబులఁ
గాంచి రందరును!

౨౭

కడకు రుద్రుఁడు విప్రవీరుఁడుఁ
గాశ్యపిని బడి పోరి రొక్కట,

ఖడ్గతిక్కన, పాంచభౌతిక
కాయము న్విడిచెన్.

౨౮

దివమునం బూవృష్టి గురిసిరి
దేవతలు! మన విప్రవీరుని
దివ్యతేజము లీనమయ్యెను
దేనియందుననో!

౨౯

పూతచరితుఁడు పుణ్యపురుషుఁడు
భూతలంబున ఖడ్గతిక్కన
నిజయశశ్చంద్రికలు దిక్కుల
నెగడుచుండుతను!

30

గరిమమై ముత్యాలసరమున
విరచన మ్మొనరింపఁబడె నీ
విప్రవీరుని దివ్యచరితము
వెలుఁగు లయమునకు!*

---

* ౭, ౧౫, ౧౯ సంఖ్యలక్రింద నుండవలసినవి మాయమైనవి.

# గీతావిహారము-౪౩

౧

ఉదయభానుని కిరణములలో
నొదిగియున్న విలాసమే
ముదితమై ప్రాతస్సుగీతా
సదనమందునఁ బొదలెరా !

౨

చిగురుటాకుల లేఁతనగవుల
నెగడు ముగ్ధార్చిస్సులే,
పగలు రేయును హృదయరంగము
సొగయఁజేసెదు నొక్కెడన్.

౩

పూవుగుత్తుల తావులందునఁ
బ్రోవువడు నానందమే
శ్రీవసంతమనోజ్ఞగానముఁ
జేయఁ బ్రేరేపించెరా !

౪

నాదు హృదయానందమునకై
నాదు సంతోషమునకై
గీతములు రచియించి సతతము
ప్రీతి నాలాపించెదన్ !

# ఉషఃప్రబోధము ౭౭

అంబరవీథికావిహార
　　ణాంచితమంజువిహంగగానరా
వంబుల నీయశోమృదుర
　　వంబుల నొక్కెడ మేళవించి, వై
శంబ జనంబులన్ నిదుర
　　లన్ విడఁగొట్టి, పవిత్రమాతృ పా
దంబులఁ బూజసేయఁగ నొ
　　నర్ప దొరంకొను మాంధ్రపుత్రకా!

గౌతమీస్రోతస్వినీతరంగాళిలో
　　జిలిబిలిరాగాలవిలసనంబు,
తెలుఁగుఁగవిత్వంపుతేటపల్కులలోన
　　ముసురుకొన్నట్టి సమ్మోహనంబు,
పలనాడువీరగీతుల లాస్య మొనరించు
　　బాలచంద్రునియశఃప్రాభవంబు,
చెలువుఁ బాసినయోరుఁగలుకోటగోడల
　　వలపించు కాకతీయులయశంబు,
నొకటఁ దలపోఁతఁ గోష్ణబాష్పోదకములు
కనుఁగెలంకులసారిది నిర్గతము లగును !
మఱచిపోతివి! నీయశోమంజుగీతి
జ్ఞప్తి కెలయింతు నాంధ్రయోషాసుపుత్ర!

పరువెత్తినారు! కృపాణావలోకన
చలితహృద్వృత్తులై శత్రుజనులు,
వినుతించినారు! నీఘనపరాక్రమమును
మధురగీతముల సామంతనృపులు,
ఆశ్చర్య మొందినా రనుపమశిల్పక
ళాభిజ్ఞతను గని యఖిలజనులు,
ధన్యులైనారు! నీధారుణీస్పర్శచేఁ
బరదేశవాసులౌ ధరణీధవులు,
నేఁడిటుల స్మరణమాత్రమై నెగడెఁగాని,
పొగడఁదర మౌనె నీపూర్వపౌరుషాగ్ని,
దహ్యమానవిరోధి వితానమటవె?
మహితచారిత్ర! శ్రీయాంధ్రమాతృపుత్ర!
కృష్ణరాయనియశోగీతికావళిఁ బాడుఁ
దుంగభద్రాంత స్తరంగమాల,
కాకతీయాంధ్రులవీఁక, యోర్గలుకోట
రామణీయకమునఁ బ్రామికొనియె,
చాళుక్యకీర్తికన్యాలసగమనంబు
గౌతమీవీచికాపూత మయ్యె;
బొబ్బిలికోటలోఁ బౌరుషజ్వాలనంబు
జంగాలకథల విశ్రాంతి నొందె,
వీరపలనాడుశోభావివిక్త మగుచు
నశ్రులఁ దొరంగఁజేసెడు నక్షియుగళి

స్మృతికిఁ దెమ్ము! భవత్స్వార్థవితతయశము
మహితచారిత్ర! శ్రీయాంధ్రమాతృపుత్ర!

కుసుమగుచ్ఛములలోఁ గ్రొందేనెఁ జిలికించు
కవితారభటియందుఁ గమ్మఁదనము,
వీరారిమానసవిదళన మ్మొనరించు
విక్రమలక్ష్మి పవిత్రపూజ,
శారదాంబావిపంచీరావములఁ దాల్చు
మంజుల సంగీత మధురిమంబుఁ,
గోటగోడలపైనఁ గొత్తందనము గుల్కు
లాలితశిల్పకళాపటిమము,
నెడఁదఁ దలపోసి, కాలంపుఁగడిమిచేత
దాస్యపిహితము లైన చిత్తములలోన
వెల్లువగ శౌర్యబీజాలు జల్లుమయ్య!
మహితచారిత్ర! శ్రీయాంధ్రమాతృపుత్ర!

డంబు మీరెడి తారకాధ్వంబునందుఁ
గురిసెదరు! దేవతావళి విరులవాన,
విప్రసంతతు లాశీఃపవిత్రగీతి
నాలపింతురు! శుభ మగు నాంధ్రతనయ!

# భాషాసాంత్వనము ౭౫

కన్నుఁగొలఁకుల నశ్రు లగ్గలికఁ బర్వ
దిక్కు లేనట్లుపోలెఁ జింతిలఁగ నేలొ?
ముకుళితకరారవిందులై మునయునీదు
ననుఁగుబుడుతల జయనినాదాళి వినుము!

చాళుక్యరాజ్యధ్వజప్రభల్ వినువీథి
    నెలరువఁ దోల్దొల్త నలరినావు!
పెన్నానదీమనఃప్రీణనగీతముల్
    పొలయంగఁ దరువాతఁ గులికినావు,
రెడ్డిరాజుల నగరీజయఘంటికల్
    తనర భోగంబుల నెనసినావు,
స్వాతంత్ర్యవల్లకీపూతనిస్స్వనముల్
    చిగిరింపఁ గీర్తితో నెగడినావు,
ఆంధ్రరాజ్యకర్ణాటసింహాసనమున
నర్తనంబుల నొకట నొనర్చినావు!
వలదు వలవంత నిటు నశ్రువుల వెలార్ప
నమలసద్గుణశ్రేణి! శ్రీయాంధ్రవాణి!

సంస్కృతాంధ్రంబుల సమ్మేళనముఁ జేసి
    రసమంజులత్వమ్ము నొసఁగె నొకఁడు,

తెలుఁగుఁగైతలలోన దీఁటుకొనినయట్టి
        పచ్చితేనియలఁ జూపిచ్చె నొకఁడు,
భక్తిచేఁ బారవశ్యోక్తులఁ జిలికించి,
        నిన్నారడించె మనీషి యొకఁడు,
నవరత్నములఁ బోషణముఁ జేసి గ్రంథాళి
        రచియింపఁ జేసెను రాజొకండు,
బాల్యమునుగోలెఁ గడిఁదిసంపదలపేర్మి
నెసక మెసఁగిత్తి, నేటి కిట్లసదువోలె
నుమ్మలిక నొంద నేల నోయెమ్మెలాఁడి!
ఊరడిలు మాంధ్రవాగీశ్వరీ! రయంబ!

భృంగిసముత్కరసంగీతమును బోలె
        భావగీతికల విరావ మొలయ,
నన్యపుష్టామంజులాలాపగతిబలె
        నవవృత్తమోహనరవము పొరయ,
శారికాగానప్రసారణమ్ము విధాన
        ముత్యాలసరముల మురువు నింప,
సెలయేటి జిలిబిలియులివులయ ట్లొప్పు
        మాధురీరసగతు ల్మలసికొనఁగఁ,
గెలన మంగళవాద్యముల్ సొలపు నింపఁ
జారుగీతారవంబులు మారుమ్రోయ

నరుగుదెంచుచున్నార లనుఁగుసుతులు,
శోక మొందకు మాంధ్రభాషా కుమారి !

పావనమైన యీయుదయ
భాస్కరు నూత్నమయూఖ పాళికా
ప్లావిత మయ్యెఁబో ! దిగిభ
బంధుర తావకసద్యశంబు; క్రొం
దావి తలిర్చె మంజుకవి
తాసుమదామములందు నాంధ్రభా
షావనజాయతాక్షి ! శుభ
సంతతి నందెదు గాసి వీడుమా !

చిఱుతరంగాల నృత్యమాధురు లెలర్ప
గాన మొనరించు కృష్ణవేణీ నవీన
ఫేనహాసము నాంధ్రుల పిఱికితనము
చూచియే యేమొ! యదియు నుజ్జోద్యమగును.

అంత మఱపేమి నీకు, వియత్తలానఁ
బూరటిల్లు చళుక్యయశోరవంబు
నన్నపార్యుని కైతవిన్నాణములను
ముసుకొనుచున్న నెఱుఁగ వేమోయి నీవు!

అదిగో! వినఁబడు కాకతీయాంధ్రవీర
పటహనిస్సాణసముదితస్ఫుటరవంబు,
అవి చెరసి మారుమ్రోఁగు విద్యాపతికవి
కైతతునుకలలోపలఁ బూఁత పూచి.

అతఁ డెవరో! యెఱుంగుదు వయ్య! అతఁడె
తుంగభద్రా పవిత్రతరంగ భంగ
నదితకీర్తి ముఖాబ్జము పొదలుచుండె
శారదారమ్యహాసవిస్ఫారి మూర్తి.

ఇదియె బ్రాహ్మము, క్షాత్రము నిదియెయనుచు
కత్తి త్రిప్పెను ఖడ్గతిక్కన్నగారు.

నేఁటితోఁ గ్రుంగిపోవుఁ బాలేటిలోన
కాటమమహీశు గర్వజంఝూట మెల్ల.

తెలుఁగుకైతల నోరసిన తీయఁదనము
తెలుఁగుకత్తుల మెఱసిన పులకరింపు
తెలుఁగుపాటలలోనఁ బ్రతిధ్వనించి
ఇగురువెట్టెడు నామ్రోదు పెడఁద గూడ.

నీమనములోనఁ జూచుకొమ్మా మహాత్ము
లాంధ్రపురుషుల చెయ్వు ల,య్యదిగో నీకు
వినఁబడుట లేదె ? యాంధ్రుల విజయభేరి
కకుభమత్తేభసంశ్రవః కర్కశంబు !

తఱిపివెన్నెలమీఁగడ కరడులందు
నవ్వుకొన్నది ప్రకృతి విన్నాణములను
నన్నుఁ గికురించి యెచట నున్నదియొ కాని
వినఁబడుచు నున్నదోయి! నీవేణుగీతి!

చిగురుసంజలలోన దాఁచికొనినట్టి
ఈశ్వరత్సర్వరీగర్భమేని నీదు
పోకఁ దెలుపదటే! విరహాకులితను
నన్ను నలయింపఁ దగునుకా! నందతనయ!

నీదు పిల్లనగ్రోవిలో నిగ్గుతేరి
నట్టిక్రొందేనె విరహపుటగ్నికీలి
కలకు నాజ్యమ యయ్యెఁబో! కాలసరణి
తప్పనెడ మంచిదియును బాధలకు నిరవు.

సొబగు లల్లిన కెమ్మోవి సొలసియాడు
వేణుగీతంబు రాగరసానుభూతిఁ
బొదుగు లేదూడ లన్నియు నిదురవోయి
తల్లిపా ల్ద్రావవటె! యశోదాకుమార!

మొయిలుతరఁగల దాఁగుడుమూఁత లాడు
జాబిలివెలుఁగులకు నిగ్గు సంతరించు

నాదరస్మేరకౌముదిఁ బ్రోదివెట్టి
విరళి చీకట్లు విరియింపవే మనోజ్ఞ!

నీవు నేనును నొకటయి ఈవిశాల
మాకసంబునఁ దారల నాడుకొనుచు
మబ్బులో మబ్బులవిధాన మారిపోయి
పోవుదము రమ్ము! వ్యోమవీథీవిహృతుల!

## శైశవలీల ౮౯

పిల్లతరఁగలు ముద్దులాడే
చల్లగాడుపు వీచుచుండెను
మల్లెమొల్లల కమ్మతావులు
అల్లుకొనె నాతోఁటలో.

పండువెన్నెల లేఁతనవ్వులఁ
బ్రకృతికామిని, శాంతియావను
నిండి తొరఁగే ప్రేమరసమును
నింపుచుండెను గొల్లగా!

బుజమునందున చిట్టిపాపఁడు
పోరు వెట్టుచు నుండ నూఱడఁ
బలుకు చుండెను మాతృదేవత
తొలఁకు ప్రేముడి వెల్లువన్.

'ఏడువకు నా చిట్టిపాపా!
ఏడువకు రత్నాలతండ్రీ!
ఏడువకు నా కడుపుపంటా!
ఏడువకురా నాయనా!

ఆకసంబునఁ జూచినావా!
ఆడుకొనుచున్నాఁడు చంద్రుఁడు
మబ్బుపిల్లలతోడ దాఁగుడు
మూఁతఁ గనుఁగొను భాగ్యమా!'

ముఖమునందునఁ జిత్రభావము
ముమ్మరింపఁగ మొల్లపూవుల
కమ్మనగవుల చిట్టిపాపఁడు
మఱచె దుఃఖము నంతయున్.

తీపితేనెల ప్రాపు చెందే
చూపులను గల కమ్మఁదనమును
ఆ పసిఁడిమైతళుకుపెంపులు
ఆవరింపఁగ మెల్లఁగా.

వచ్చియును రానట్టిపలుకుల
నచ్చి ఋత మాటాడఁ దొడఁగెను
పలుకుపలుకునఁ దొలుకునమృతపు
టలల మునిఁగెను మాతయున్.

'బువ్వ తిన్నా! చందమామా!
నవ్వుతున్నా వెందుకోయీ!
రివ్వురివ్వున యెగిరి వస్తా
ఆడుకొందామా! పాటలు
పాడుకొందామా!

కాళ్ల గజ్జెలు కట్టుకోసీ
మల్లెపూవులు పట్టుకోసీ
ఘల్లుఘల్లు మటంచు వస్తా
ఆడుకొందామా! పాటలు
పాడుకొందామా!

చుక్కపిల్లలు, మబ్బుపిల్లలు
ఇక్కడికి వస్తాము అంటే,
ఇక్కడికి నువ్వుగూడ రారా
అక్కడున్నట్లే!

లేడిపిల్లను తోడు తీసుక
లేచిరారా చందమామా!
దూడతో మాయింటిముందర
ఆడుకొందాము!

ఈవిధంబునఁ జిన్నపాపఁడు
పావనంబా మొదఁదతోడా
చెప్పుటకు శక్యంబు గానీ
చిన్మయానందంబు నొందెన్.

కష్ట మెఱుఁగని అతనిహృదయము
క్రమ్ముకొనె నానంద మొకటే,
తల్లియును నాశ్చర్య మొందుచుఁ
దన్మయత నొందెన్.

దుఃఖమయమౌ యీజగత్తున
తూఁగి యాడే హర్షకందము
మాయ నెఱుఁగని చిఱుతపాపల
మధురమధురసవాణియే!

# దీపావళినాఁడు ౪౭

౧

అదిగో! మావీరమాత, వియచ్చరావ
ళీమనోహర నృత్యపాళిక నదించు
నాపె పదనూపురాంచల స్నాపితములు
కింకిణీనిస్వనంబులు క్రేళ్లు దాఁటె.
అంత గర్వము, తనకు నీ డైనవాఁడు
మూఁడులోకాల లేఁ డనన్నాఁడు భళిర!
క్రూరనరకాసురుండు విస్ఫారఖలుఁడు,
నేఁటితో గర్వ ముర్విని దాఁటిపోయె.
మా భరతమాత, తనయంకమందు నిలుప
వచ్చుచున్నది కృష్ణుని వలపులాఁడి;
ఓహో! త్రిజగత్ప్రమోహినీ! ఆహరించి
నావు ప్రాపంచికపు శౌర్యనాదములను.
మధురతనుమూర్తి సత్యభామావధూటి
కఱకుతరవారి బెడిదఁపుటాఱుపుచేత
మడిసినాఁడకె, యమరసామ్రాజ్య మెల్లఁ
గొల్లవెట్టిన యసుర, క్రూరోల్లసితుఁడు.
క్రమసంతానకుసుమనిర్గతసురభిళ
మారుతము స్తంభితంబు నీక్రూరువలన

ఇంత తల కెక్కెఁ బాగ రేవఁడేని బాగు
పడిరె దివ్యులక్రూరత నోడుచువారు !
మూఁడులోకాలవేలుపు, మోహనాచ్ఛ
నీలతనుమూర్తి, బాలగోపాలకుండు,
పాడె నాఁ డప్పు డుదితసంభ్రమవికీర్య
మాణజగదేకనవ్యకళ్యాణగీతి !
అపుడు మాతల్లి, వీరతావిపులమూర్తి
కరుడుగట్టిన పౌరుషస్ఫురణ మయ్యె,
పాపములు పండినవి, తరవారికోఁత
క్రూరనరకాసురాధముఁ గోరుకొనియె.
అదిగో ! చూచిరె, వియదంగణాంతరమునఁ
గుసుమవర్షము, నప్సరఃకోమలాంగి
నర్తనమ్మును బాలుచు నానందఫణితి !

మీకు వినఁబడ లేద! త్రిలోకగురుని
యాజ్ఞ జనులార! ప్రాతరాయాత మంద
మారుతంబులతో స్నానమాడి, యెత్తుఁ
డయ్య నీరాజనంబు సత్యాంబకొఱకు!
వాఁడు పూర్వపు పుణ్యప్రభావ వశత
మూఁడులోకాలఁ గీర్తిఁ గన్నాఁడు భళిర!
లాలితపటీర కాష్ఠమాలలను బేర్చి
తగులఁబెట్టుచు నున్నారు తద్ద ప్రీతి.

మా భరతమాత, తన వీరమస్సృణమూర్తి
సత్యభామను నోడియందు సంతరించి,
చూపుచున్నది కనినారె సోయగములు
చూచు లే మీ హృదంతరలోచనములు!
ఆ పెకత్తులమెఱపు లొయ్యాన జగత్తు
నకు భయావహ మౌచుఁ దనర్చుచుండె
విశ్వము నదించు భారతవిజయభేరి
మ్రోఁగుచున్నది హృదయాబ్జమూలమందు.

# విశ్వమాత ౫౦

ఆశాపూరితమైన నీమధురవీ
ణారావముల్ మాకు సం
దేశం బిచ్చెడు, నీవిహంగమృదుగీ
తిస్ఫీతు లొల్కంగ మా
యాశల్ నీపదపంకజధ్వనితదీ
వ్యత్కింకిణీనాదమం
దే శోభించెదుఁ బండి, సంతతము మా
ధీదివ్యమాధుర్యమా!

సస్యలక్ష్మీముఖాంచలహాసరేఖలో
నీ ముఖార్చిస్సులు నెలవుకొనియె,
ఫలియించిన రసాలపాదపశ్రేణిలో
నీ కమ్మఁదనములు నిగ్గుతేరె,
విరతి లేనితరంగవీణారవంబులో
నీదు పావిత్ర్యసందేశ మొలికె
నభ్రచుంబిమహీధరాగ్రకూటములందు
నీ పరార్థ్యప్రభల్ నిగిడికొనియె,
వచ్చుచున్నాము దేవి! భవన్ముఖాబ్జ
కందళితహాసదివ్యరాగములు గ్రోల
నంజలిపుటంబు లియ్యవి ఆదరింపు
నిండియున్నవి వేఁడికన్నీటితోడ.

మంజరి :

మా స్వధర్మము మేము మఱచిపోయితిమి!
అంతమే లేనిమోహాంధంబునందు.

*　　*　　*

ఎండమావుల నీర మొండిపోయినది !
గగనప్రసూనరాగములు తూలినవి !
మాయమ్మ! నీపాదమధురదీధితులు
తేలిపోయినవి మాదృక్కులలోన
వచ్చుచున్నాము సేవాపరిష్వంగ
హృదయపూజాసుమం బిచ్చుకొనంగ,
మా స్వధర్మము మేము మఱచిపోలేదు !

# పినతండ్రికి ౫౧

కాలశాంఖికుఁ డిట్టు లకాలమృత్యు
నాదములు చిమ్మిపోయె, యీనాటిప్రొద్దు
నేఁటిజన్మకు ఋణము పొందితిమి నీకు
తీరిపోయె నీనాటిప్రాగ్దీప్తులందు.
నీవు నడచిన భావమందిరములందు
స్ఫాటికోపలమధురహాసములె కాని
నైల్యమే లేదు! నీ వదనంబులోని
కళలు సంధ్యాపవిత్రరాగములుసుమ్ము!
మామకీనము సంస్కృతిమందిరమున
వెలుఁగుదువుగాత! ప్రాగ్దిశావీథికాంత
రాళనీరేజబంధువిరాజమాన
క్రమసౌవర్ణదివ్యరాగములు తొలుక.

ఏయమూల్యదినంబుల నీయనంత
ప్రేమవాహినిలోఁ గవితా మధురిమ
మారు మ్రోఁగి దిశాంత గంభీరరావ
ప్రణవమాధుర్యసీమలఁ బల్లటిలెనో?
క్రొత్తనునుతమ్మిపూవు జేకులను సోన
లైన యీపచ్చితేనియ లాహరించి,
ఎంత మాధుర్యపాకము నిచ్చినావు?
ఎంత తీయఁదనాలు వర్షించినావు ?
భృంగ మెఱుఁగని తేనెతీపిని, పరిమ
ళమ్ము గ్రోలనికుసుమము కమ్మఁదనముఁ
తెలిసికొన్నావు నీవంటి దివ్యమూర్తి
కానఁబడ లేదు మూఁడులోకాల మాకు.

# సమర్పణము ౫౩

వీథివీథుల మథురలో వెదకినాను
కానఁబడ వేమి! వల్లవీకాంత! నీవు
నా సమస్తము నీ కర్పణంబుఁ జేసి
నే ననెడువస్తువే లేక నిలిచియుంటి.

అనుభవింపు యథేచ్ఛతో నాత్మనాథ!
నీ భుజాపంజరమున బంధించుకొనుము
కఠినచుంబనక్రీడలఁ గారవించు
మింతకంటె కావలసిన దేమి? నాకు.

నీ పదాబ్జమూలంబున నిలిపినాను
నీ విపంచిక దీని నదించుకొనుము,
తంత్రు లెడలింపు కాని గీతం బొకండు
కలిపికొమ్ము! మహాప్రభూ! గళమునందు.

# మావటీఁడును దేవుఁడే! ౫౮

గురువు

జగతిఁ బొలుపారు వస్తుసంచయము లెల్ల
నామహాత్ముని రామణీయకము లగును,
జంగమస్థావరం బైన సర్వసృష్టి
నాపరంధాముఁరూపమే యగుఁ గుమార!
శిష్యుఁ డాలించె నీవచశ్శ్రేణికలను,
గాని దానఁగలట్టి భావానురూప
మర్థము గ్రహింపలేఁడ, దైవానుగతిని
పోవుచుండె నతం డొకపురము వీధి.

వానికెదురుగ నొక మత్తవారణంబు
సరసగంభీరగమనప్రసక్తి యెసఁగ
వచ్చుచున్నది! మావటివాడు శిష్యుఁ
దొలఁగు తొలఁగని పెద్దగొంతున వచించె.
'నేను తొలఁగను! లోకము లేనిశక్తి
నుద్భవిల్లి ప్రకాశించి యొకట గ్రుగ్గు
నామహాత్ముఁడు భగవానుఁ డరయనేను
ఈసమస్తము నాలీలయే తలిర్చు.

ఈమదేభము భగవానుఁ డేనుగూడ
దేవుఁడను; దేవుడే తను దెగడికొనునా?

భయ మికే' లని శిష్యుఁడు ప్రతిమవోలెఁ
గదలకుండెను రాజమార్గంబునందు.

చండవేదండతుండ ప్రచాలనమున
జర్జరీకృత మయ్యె నాజడునితనువు
ఎట్టులో తెప్పరిల్లి తా నేఁగినాఁడు
గురుని పాదాంబుజంబులఁ గూర్చి వేగ.

'ఓ గురూత్తమ! భగవానుఁ డొప్పనంత
నంతయును నామహాత్మ్యఁడ యని వచించి
కీర లని యాకథానక మెసఁగఁబలుక'
లేతఁచిరునవ్వు నెమ్మోము పూఁత వెట్ట.

అగును! సర్వము నాతని యద్భుతంబు
నీవు దేవుఁడవా కరిదేవమూర్తి
'మావటీఁడును దేవుఁడే' నీవు దేవు
మాటఁ దప్పితి గావున మలసె నిదియు.'

శిష్యునిమనంబు ప్రాతరంజితజలేజ
బంధురోచిస్సులందునఁ బ్రామికొనియె
మలయపర్వతకూటనైర్మల్యవాయు
ఘణితులందు పటీరాంబు కణము లొలికె.

# కవి - కవిత ౫౫

తరఁగలఁ దేలియాడుతెలి
తామరపూవును దేనెసోనలన్
దొరయఁగఁ జాలుశబ్దముల
తోడ గభీరమనోజ్ఞభావవి
స్ఫురణము పొంగిపోయి తని
వోయినపాఠకు నాత్మఁ దన్మయాం
తరమున ముంచివైతువు సు
ధామధురాంచితకావ్యసృష్టిచే.

ఆతపబాధితుం డయిన
యట్టిఁడు చల్లనినీడలందు నె
మ్మై తనరారు నట్టుల ర
సార్ద్రితతావకకావ్యమాధురీ
స్ఫీతతరంగమాలికలఁ
జేరిమిఁ దానము లాడి, హార్షవి
ద్యోతితుఁడౌ నరుం డతుల
దుఃఖపుఁబంకము వీడిపోవుచున్.

నీమహనీయవాణి ధర
ణిం బ్రసరించినమాత్ర మోడులేన్
బ్రాము, నవీనశోభలకుఁ
బ్రా, పయి, పల్లవముగ్ధహాసరే

ఖామధురంపుతళ్కులఁ జొ
కాటముగా వెలి దార్చె నౌర! నీ
డా మనముం గనుంగొనెడు
నట్టిఱు శుష్కమనస్కు లౌదురే?

చింతను సంతసంబు వికసించుచు నుండును గర్కశోపల
స్వాంతము వెన్నయుంబలె నెసంగు మృదుత్వముఁ దాటుచుఁ గ్ర విష
స్వాంతుని తీక్ష్ణతాపమును
చల్లదనంబును గొల్లలాడు బో!
సుంత భవత్కవిత్వసుధ
సోఁకినమాత్రఁ గవీంద్రశేఖరా!

ఏమృదుభావవీచికల
కిక్కయె నీ హృదయాంబుజంబు, నె
డ్డే మధువాహినీస్రుతస
మిద్ధసుగీతులు వెల్లివారునో,
నీమనముం గనుంగొనఁగ
నేరుతురే పెఱవార లబ్ధిపై
చీమృదుగీతి కర్థము వ
చించురసజ్ఞులు తక్క సత్కవీ!

అలరు నొక్కెడ నీహృదయప్రవృత్తి
చిగురునునుసోయగంబులు చివ్వఁగొట్టి,

ఒకటఁ పాషాణరూపవధూర్జిత మయి
తనరు నీరీతి భావబాంధవ్యగతుల.

నీవు దుఃఖింతువేని భాష్పావిలములు
పారకువికస్వరాంబకపంకజములు!
హర్ష మొంది రచింతువే నపుడ పొలుచు
నాచరణము_స్తకంబు రోమాంచవృత్తి.

ఆత్మఁ బంధించు శైలము లధిగమించి
స్వైరవిహృతి భవత్కవితారసాబ్ధి
తోలఁకఁజేసెడు స్వీయమాధుర్యలవారి
భూమితలమున నమృతముల్ పులకరించు.

# పసిపాప నగు

ముత్తెములఁ గ్రుమ్మరించు నీముద్దునగవు
ఘోర సంసార దుఃఖ నివారకంబు!
అకలుషిత తావకీన దృగంచలార్చి
కష్టతమస విపాటన కారణంబు!

పదముల వచింపరానట్టి భావచయము
నలఁతి జిలిబిలిపలుకులు వెలువరించి
పారమే లేని సంతోషవారిరాశి
మునుఁగు పసిపాప ధన్యతముండ వీవె!

లాలిత భవన్మనోహర డోలిలోనఁ
గాగితపుఁబూల దారకాగణము లనుచు
చిన్మయానంద మొందెదు చిఱుతపాప!
వివిధదుఃఖావిలంబు నీవిశ్వమందు
చిందువారఁగఁ జేయు మానందవృష్టి.

చిగురుఁబసిమేని నిద్దంపుఁజెన్ను తొలఁక
నాట లాడుము! నా వరహాలతండ్రి!
తన్మయత నొంది జంగమ స్థావర మగు
జగతి, ఆనందతాండవోత్సవము సలుప.

తేనియల కమ్మఁదనములఁ దెగడివైచి
జాలువారెడు నీవచస్సరళనవ్య
మధురమధుసేచనంబున మామకాత్మ
భావవీచీరవంబులోఁ బల్లవించు.

# ప్రకృతిశోభలో నీవు ౫౭

ఉదయాచలంబులో గదియించినట్టి
కెంపుఁజాయలలోన మంపు నింపెనఁట!
లేఁతసూర్యునవాంశు వ్రాతమ్ములోన
దోబూచు లాడుచుఁ దురఁగలించెనట!
మొగిలుపిండులలోన ముగుదసోయగము
వెలిఁ దార్చు మెఱపుఁదీవియ నొప్పెనంట!
చంద్రోదయారంభ సాగరతటిని
నానందగీతుల నణఁగి యున్నదఁట!
సదమల జ్యోత్స్నాప్రసారములందు
శైత్యసంపదలో నెసంగుచున్నదఁట!
నీ మనోహరరూపరామణీయకము
నవనవానంద సౌందర్యలాలనము,
హృదయముఁ దనియించు నెసకము పేర్మి
కవితను నల్లించు కల్పనాశక్తి.

# ప్రళయమూర్తి గిర

ఇది విలయకాలమేఘమయేని నన్నుఁ
జంపఁగలదేమొ ? కాని నిలింపభూజ
మాధురీవీచులందున మఱుఁగియున్న
ఈ ప్రసూనసంచలనము నెటు లొనర్చు ?

ఇది విలయకాల బాడబమేని, నిదిగో
సంద్రమును ద్రావుఁగాని యీసాగరమున
నంత మెఱుఁగని గానము లల్లుచుండు
నీవిపంచిక నెటు శిథిలించఁగలదు ?

ఇది విలయరుద్రనాట్యమయేని నన్ను
గజగజ వడంకఁజేయఁగఁ గలదుగాని
నాట్యకారణమైనయానందవీణఁ
దంత్రి నొకటేనిఁ జలియింపఁ దనరదటవె ?

# పరిణతి ౫౬

౧

దట్టపుమొగిళ్లు క్రమ్మి పద్మప్రియార్చి
నొక్క రేఖయే వెలిఁ బర్వ నోపనీవు.

* * *

మఱల నుదయింపఁబోడు పద్మముల రాజు
ఎల్లకాల మాగతినఁ జరించు మబ్బు
లీ చిఱుతవానకాల్వల నీదఁగలవు
గాలితాఁకున నాదునౌక లివి యొల్ల.

తలఁచితి నెడంద నీగతి తలఁపుపూల
వేసములు కట్టు శైశవవీథులందు !

౨

కాలవాహినీ క్షుభితకల్లోలధాటిఁ
గొట్టుకొనిపోతి నిచటకు దట్టమైన
మబ్బుతెరలోన నంశుమన్మధురకాంతి
వెలుఁగుచునె యున్నదని హర్ష పులకితుఁడను!

# జీర్ణగృహము ౬౦

ఎపుడు కట్టిరో! నాకు తెలియదు మాగృ
హంబు తాతలు ముత్తాత లందులోన
నవ్వి, యేడ్చి, పెండ్లాడి సంతతులను గని
పరువు లెత్తిరి కాలగర్భమునయందు!

చిన్నతనమునఁ దల్లులకన్న ప్రేమ
మెఱయ నల్లారు ముద్దుగా పెరిగిపెరిగి,
పెద్దవా రయి, ప్రియురాండ్రప్రేమఁ గ్రోలి,
కడఁది వార్ధక్యభారముఁ గాంచినారు!

ఆదినంబులనాఁటి గృహంబు, నేఁడు
శిథిలకుడ్యంబు రూపఱి చెన్ను తరిగె,
నమితమైన జరాభార మావహించి
భూమితలమందునక్ బడిపోవునోటు!

నేఁడు వోయి తదంతరనిలయమందు
నిలఁబడితి నేను—మాయిల్లు పలికె నిట్లు
'ఓ దురాశామనస్వి! నీ వుబ్బిపోకు
కాచుకొనియుండు! కాలచంక్రమణలీల!

# జీవనపాత్ర ౬౧

అమృతకలశము నెత్తి యోష్ఠమునయందుఁ
బెట్టుకొందునో లేదో? నాపెదవు లుదరి
చేయి కంపించి తన్మధుశీకరములు
తొరఁగి యుర్విపై వ్యర్థమై ధూళిఁ గలియు.

ఆసవము నిట్టులేఁ బారపోసుకొనుచుఁ
ద్రాగలేన శీకరమేని, దగ్ధరిల్లి
పోవుచుందు నీయత్నముతో, విశోషి
గాఢనైదాఘ భాఃకళాగ్రములు రేఁగ.

ఒలికినసుధాంబు లొలుకఁగ నున్నసుధయు
జీర్ణ మగుచుండె నిప్పులు చెరుగు మండు
టెండలందున నీపాత్ర యిగిరిపోయి
వ్యర్థ మానే మొ? స్వామి! నాప్రాణ మడలు!

నీకృపాంబులఁ బాత్రిక నింపదేని
నార్చుకొనెద నీయుగ్రదాహంబు, లేక
త్రాఁగెదవ యేమి? శోకవిద్ధంబు లైన
యీయనాథదుఃఖాశ్రువు లో యనంత!

# అడవిత్రోవలో ౬౨

ఈ మనోహరవృక్షాగ్రసీమలందు
భావరాగాలు తీయు నీపరభృతంబు
తోడ దివ్యమరందవీథులకుఁ బోయి,
మలయవాయుతరంగాలఁ గలసిపోదు!

అంటినంతన వసివాడు నలరు సోచు
మోసలందుఁ బరీమళమ్ములు వెలార్చి
తోడిపూవులతోడనే వాడిపోయి
ధరణి బ్రుంగిన జన్మసార్థకము నాకు!

పరిమళసనాథవివిధపుష్పములలోని
తన్మనోహరవాసనాంతర పథంబు
లందు విహరించుతుమ్మెద నైతినేని,
ఈ శరీరంబుతోడ నా కేమి చింత?

తరుణపేశల పుష్పమంజరులయందు
నమృతనర్తనోత్సవముల నభ్యసించి
పాడుకొందును ప్రణయవిపంచిఁ దాల్చి
అంతు లేని యానందరసాధిమూర్తి!

ఎవ్వ రీన_ర్తనంబుఁ గావించువారు ?
అంతులేని యేకాలమునందు దీని
మొదలు పెట్టిన మాధుర్యమూర్తి యెవఁడో?

పాలకడలితరంగాలఁ దేలియాడి
బాడబవిషాగ్నికీలలఁ బ్రజ్వలించి
అతిసముత్తుంగభూమీధ్ర మధిగమించి
ఫణిఫణాచయరత్నసంపద స్పృశించి
ఎవ్వ రీన_ర్తనంబు గావించువారు ?
అంతులేని యేకాలమునందు దీని
మొదలు పెట్టిన మాధుర్యమూర్తి యెవఁడో?

అంతమే లేని యానర్తనాతిరణర
ణన్మనోహర కింకిణీనాద మదిగో,
వినఁబడి వినంబడద శ్రవోవీథులందు !
ఎవ్వ రీన_ర్తనంబు గావించువారు ?

మలయశైలపటీరనైర్మల్యవాయు
భంగములయందుఁ జంద్రమః పరమధౌత
నవసుధాస్నిగ్ధకిరణసంతతులయందు
మెఱసి, తళుకుతళు క్కని పొరలు గట్టు

నీ యనారతామ్లానమహా యుద్ధదీప్తి
ఏ మహానాట్యరాగమో? యెవ్వఁ డెఱుఁగు?

నేల వ్రాలిన ట్లుండెడు నింగిమీఁద
మబ్బురేకల తెరమాటు మఱఁగియుండి
అల్లఁ బ్రాచీసతీవదనాంచలమున
రాగములు గ్రమ్ము నెవనిపర్యాప్తశోభ!

* * *

అదిగో! వినవచ్చెఁ దారకాపథమునుండి
నేన యానందమూర్తిని, నిఖిలవిశ్వ
నాట్యకర్తను నావదనప్రభూత
మంజులస్మేరరాగనైర్మల్యమందు
నఖిలవిశ్వజీవనగీతి ఆశ్రయించు!

నేన యానందమూర్తిని, నిఖిలజీవ
రాసులందు ననంతమై మోసులెత్తు
నామనోఽనంద మది, వసంతసుకుమార
మధురమాకందవీథుల, సుధలు ప్రాకు
కన్నెకోయిల ప్రేమరాగాల నిండు!

అదిగో! వినవచ్చె సంద్రపుటలలపైన
చెప్పరాని మాధుర్యపుంజీభవన్మ
నోహరానందనర్తనానూనగతులు.

దిగ్దిగంతరాళంబులఁ దెరలివచ్చి
తేనె లొలికెడుమధురగీతికలు నేను !
నీ విషాదాశ్రుకళికల నావరించి
నీవు నే నయి పోయెదు నేను నేను !

ఈమహానర్తనంబుఁ గావించుచుండుఁ
బార మంటదు దీనివైభవ మిదేమొ ?
ఎఱుఁగవలె నను కోరిక యేల నాకు,
నేను నే నయి నాలోన నేఁ లయింతు !

నను వీడందగదే! మనోహరి! యుగాం
తవ్యాప్తమందానిలం
బునఁ జాంపేయపరీమళగ్రహణస
మ్మోదంబునన్ మున్గిపో
యినదాకన్ - సొగయించు నీముఖము నా
యీఘ్రాణవాతంబులం
దునఁ దూఁగాడెడు, నిన్ను నే విడను న
న్నుం వీడకే మోహినీ!

ప్రకృతికమనీయరుచుల నాభావవీధిఁ
బొంగిపోయెను ని న్వీడి పోవలేను!
నాసమస్తము నీ కిచ్చి నవ్యహేమ
కలశమధుగీతికలు పాడ వలపు నాకు!

నేను మాకందమూర్తిని, నీనవీన
పంచమస్వరలోభినై భావగీత
కిసలములఁ బేర్చితిని వానిఁ గసరికొట్టి
నాదు కన్నీటికాల్వలో నీదఁబోకు!

కనులఁ జీల్చెడు నేభయంకరతమిస్ర
పుంజములయందు మాయ మైపోయెదనొకో?
ఈ మహాదుఃఖమున దహియించుచుంటి,
నీవు నను వీడి పోకుము! జీవధనమ!

# భవిష్యత్తు ౬౫

ఎన్ని పికములు నే పాడుకొన్న పాట
లిదివరకె పాడుకొన్నవి యేమొ? నేను
పాడుకొను చుండుటయె గాని పాటలోని
మంచిచెడ్డలఁగూర్చి యోజించ లేదు!

ఈ వసంతము గడఁచి నాహృదయసీమఁ
గారుచీకట్లు మూఁగిన కాలమందు
పాట లన్నియుఁ గడు పరాభవము చెంది
మరలి వచ్చునేమో? నాసమాధికడకు!

జీవవాహినీచలితవీచీవితాన
ముల శ్రమంపడి యున్నముముక్షువువలె
పవలు తిరుగాడి మేతకై పక్షిజాల
మరుగుచున్నది స్వీయనీడాంగణముల.

విశ్వ మావహించిన మహావిద్యుదర్చి
కారుచీఁకట్లకొండలో కాలు వెట్టె!
విస్తృతజగత్ప్రవృత్తి, నివిష్టదివ్య
బ్రహ్మతేజంబులోపలఁ బాన్పువేసె!

# మాయూగిలో ౬౨

ఎప్పుడో!...విస్మృతించితి! నెన్నినాళ్ళ
లో గతించెను! దేవతాలోకవిచ్యు
తుం డయినవాఁడువోలె నాదుహృదయమునఁ
బ్రజ్వలించెను నిపుడు పాపములవహ్ని.

మాయ నెఱుఁగరు పాపముఁ! మనసులోన
నాటిచెలికాండ్రు వారలతోటి యాట
పాటలలో మూఁడుజగములు ప్రళయవార్ధిఁ
దేలిపోయిన లెక్క-లేదే! నిజంబు!

శైశవస్వర్గనేతలమై, శనైరు
దన్మరుత్తుల మాపల్లెతరులలోన
నూడలందు డోలాకేళి నూఁగినాము!
ఏమి యేమైన నెవ్వరి కేమి లెక్క!

ఆడుకొని, ఆడుకొని, కడు నలసిపోయి
ఆతటాకశైత్యాంబువు లంది వింటి
మమృతగీతులు హృదయరాగములలోన.

మాదు క్రీడాపరత్వ సమ్మదములోన
భాగములు పంచుకొన్న యాపల్లెతరులు

నేఁటికిని మాఁడు జీర్ణసంఛిన్న దివ్య
రాగములఁ బత్రమర్మరరవము లూఁదు.

కనులు తెరచి సారించితి, కానబడును
యేమొ యని తద్దివంబు! నాయీహ్యాదంత
రాళమైనై గాఢ్యబంధురనీలమేఘ
పటలిలో దివ్యదీప్తుల త్రుటియు లేదు!

## నివేదనము ౬౫

రాజు

నా భుజారక్ష నందిన యీభువనము
లందు ధర్మదేవత తనయందె మ్రోఁత
నాకు వినిపించె నని నేఁడు లోకనాథ
దివ్యపరిషత్తులోపలఁ దెలిపికొందు.

దాత

నా సమస్తము దీనసంతానహృదయ
కోమలాంభోజవీథి పరిమళించె,
రిక్తమైయున్న హస్తవారిజయుగంబు
చూపుకొందును నా జగత్సుందరునకు!

కవి

పాలసంద్రంబులోపలఁ దేలి వచ్చి
అమృతవారాన్నిధులఁ దరంగములు త్రచ్చి
కూడుకొని యున్న నాపాటఁ బాడుకొందు
నా జగన్నాథపాదనీరేజమందు!

# భగీరథుఁడు ౯౯

౧

ఆ భగీరథు భ్రుకుటివీథీభసితము
లోనఁ జంద్రమఃకాంతివల్లులు చిగిర్చె,
నాకసమునుండి భూమికి లోకనాథ
నిర్గుణాతీతమూర్తి పుంజీభవించె.

ఏకపదమున నిలఁబడ్డ ఆకపర్ది
పాదమంజీరఘంటికాఘణితులందు
భాసమాన నైశ్చల్యనిష్ఠాసమాధి
మారుమ్రోఁగించుకొనియె నోంకారఘంట!

౨

రజతశైలదరీకుహరంపు టెల్ల
లందు శైవత్రిలోచనస్యంది భుగభు
గాగ్ని కేడుగడంబలె నన్నికడల
నావరించెను బ్రళయవేళావిషాగ్ని!

గంగ చిరునవ్వుతరఁగలు పొంగిపోవ
నల్లఁ జూచెను లోకలోకాధిపుండు
వారి యన్యోన్యదృఙ్మరీచిరసంబు
లోన లోకంబు ప్రణయవిలీన మయ్యె.

శాంకరజటావనీవికస్వరపవిత్ర
దివ్యకల్లోలములు సుధాంతికము లయ్యె
ప్రమథలోకతాండవసుధాభాగధేయ
దివ్యగీతము లల్లనఁ దెరలివచ్చె.

ఆ విశ్వేశజటావనీపథములం
దారబ్ధసాయంనట
చ్ఛైవస్ఫీతరవానుసారముగఁ బ్రాం
చద్దివ్యకల్లోలినీ
గ్రీవాభంగవిముగ్ధగీతికలు పొం
గెన్ శుష్కవారాన్నిధిన్
ప్రావృణ్మేఘము లాశ్రయించినవి తృ
ష్ణాకార్శ్యరూపంబులన్.

నిశ్చలధ్యానముకుళితనేత్రములను
నల్లఁ దెఱచె భగీరథుఁ డంతలోన
శివజటాజూటనిస్సృత దివిజగంగఁ
బూరితము లయ్యె నాలుగు వారినిధులు !

ఆ వేలాంబరచుంబితోర్మికల దీ
వ్యద్దివ్యవీథీపథం
బావేశించి రథఃప్రపాతితమహాం
హఃకల్మషుల్ సాగర

శ్రీవిస్తారితలైన శాణ్మాణులు రం
జిల్లెఁ మహాయోగి, గీ
తావాద్యంబులు ఖేచరాప్సరసనృ
త్యక్రీడ లందిచ్చెఁ బో!

కపిలమాని క్రుధావిలోకనములోని
మెఱుపుతో వారిపాపము విఱిగిపోయె
శశ్వదాభోగ దేవవేశ్మములయందు
సాగరుల దివ్యదీప్తులు సంక్రమించె.

# దండకాటవి ౨౦

౧

కోమరులేడి సూదులవంటి కొనలు తేరు
దర్భపోచల నములుచుఁ దరలి వచ్చె;
ఇది తపోవనమే యని యెఱుఁగఁ జెప్పె
శారికాకీరికావళిసామగీతి !

మావిపూఁతల మిసిమి క్రొందావిచిగురు
సొగసురాగాలు కోయిల సోన వెట్టె,
పిల్లగాడుపు సంగీతవల్లరులకుఁ
బూలు పూయించె దశదిశాభూములందు.

ఆశ్రమోపాంత వల్లికాహార్మ్యమందు
భార్గవునిపుత్రి, స్వర్ణశోభాసుగాత్రి,
పడుచుఁదనపుటొయ్యారంపునడలు తెల్పు
చూపుఁగొనల సుధామయాంశువులు పిదికె !

దండకమహీశుఁ డటకు, సంధ్యాప్రశాంత
వేళ వాహ్యాళి వచ్చెను, బాలపల్ల
వారుణచ్ఛవి బంగరునీరు వోసె
అతని మాణిక్యమకుటదీధితులయందు !

దక్షిణాశాసమీరసమాంధ్యములలోన
కామదేవుని శస్త్రవేగములు పర్వె,

వల్లరీకుంజగతభార్గవసుకుమారి
స్వర్ణమూర్తియై దండు వీక్షణము లూచె.
భృంగరాజు ఝుంఝుమ్మని పొంగిపోయె
ఇగురుపాగ రెక్కి పాడె కోయిల మరింత.

*   *   *

ఆ నికుంజముం జేరి సౌహార్దగీతిఁ
బాడుకొను కాంతు దండునిభావ మొందె
నెఱుఁగఁడో యేమొ? తాపసస్ఫురదనూన
వీక్షణాగ్ని లోపల లయవేళ యనుచు!

భార్గవకుమారి, వివిధవిభ్రమవిలోకి
తంబులను జూచె హరిణముగ్ధాముఖంబు!
దండునిహ్రాదంబుజాతమధ్యమునయందు
లోచనసుధాపిపాస యుల్లోల మయ్యె!

౨

ఆ మహాగ్నుల మధ్యంబునందు, దివ్య
మూర్తిమంతుఁడై, భార్గవముని, జగత్తు
నందుఁ దన లీల నరసి బ్రహ్మాండమంత
తానయై నిర్గుణత్వసంధాత యయ్యె!

ఆత్మలో శోకగద్గదికాతిభుగ్న
భార్గవీకంఠనిర్గతఫణితిఁ దెలిసి,
అట్టెఁ గనుదోయిఁ దెఱచె తదంతరాళ
దివ్యనిష్ఠానసమాధి వేదికలనుండి.

ఇది జనాకీర్ణసంకుల మిచ్చ టెపుడు
ప్రబలధనపిశాచీనృత్యఘణితి తప్ప
కన్నులే తేవు చూడ లోకాలు దాటి.
దివ్యసంధ్యారుణచ్ఛవిదీప్త మైన
ఒక దినాంతమునందు నే యూరిబయటి
కేఁగితిని నా మనశ్శాంతి కిల్లుకొఱకు.
అచటి తలలెత్తుప్రతి మెత్తనైన చిగురు
సృష్టిలోని రసోర్మిని శ్రేణిఁ జూపు!
అది ప్రశాంతసంవలిత మా పదములందు
మ్రోఁగు నవ్యక్తవల్లకీరాగగీతి!
కన్ను లామెత లొందెడు జొన్నచేలు
పాడుచుండు విశ్వంభరాభ్రమణగీతి
ప్రకృతిదేవి నిద్దుర బుచ్చు బాలపవనుఁ
డేమియో మాట లల్లి సుధామృదువుగ
కనులు చూడనే లేవు తద్గమనరీతి,
చెవులు వినలేవు కూడ తత్స్నిగ్ధగీతి
మానవాతీతసౌందర్య మధురిమములు
బాలలీలలు నచ్చటఁ బడయుకొనియె.
వినపడనిగీతిఁ బాడు నీఘనవివిక్త
ప్రకృతిమాధుర్యదివ్యడోలికలలోన
నెచటికో పోయినాను! నా కిపుడు తనువు
భాసిలున” చెప్ప మని ప్రశ్న వేసినాను!

# స్మృతి పటము ౭౨

(ప్రపితామహుఁడు పెనుమర్తి వెంకయ్యగారు)

౧

నీవు మీటినవీణె కిన్నెరలు వినిరో?
చారణకుమారికలు విని నారొ యేమొ?
ఈసమాయాతవాయూర్మికాసరుణుల
నభ్రవీథిలో వినవచ్చు హర్షగీతి.

ఆ రసతరంగిణీప్రవాహముల మున్గి
అంతులేకుండ నెచటికో అరిగినాను!
ఎటుల వచ్చితివోయి, యిచ్చటకు నీవు
అని యడిగినార లచ్చటిజనులు నన్ను.

౨

శారదాకుచస్రుతమధుక్షీరపాన
మత్తుఁడైన మా తాతకమ్మందనాల
పాట నన్నిడ్చుకొని వచ్చెఁ బ్లావ్యమాన
భావడోలావిహారలాభములు గూర్చి.

అని వచించితినో లేదొ? అచటివారు
ఎంతపూర్వపుపుణ్యమో యీ! కుమార!

అని సముద్భూతకించిదీర్ష్యాళు వైరి
విస్మయోదయదరహాస వేదులందు !

3

నీ దివ్యాననరక్తిక స్మితసము
న్మీలత్తుషారచ్ఛవీ
ప్రాదుర్భావముఁ జూడ నైతి నని త
త్ప్రాగల్భ్య రాగక్రియా
స్వాదుస్వచ్ఛమరందపూరముల నా
స్వాదింప లేదంచుఁ జిం
తాదైన్యంబు నశించె నీమధురనా
దబ్రహ్మదివ్యాకృతిన్.

నీ వెటుల యుంటివో ! నాకు నేఁడు మూఁదు
గళనిలీనరాగస్వరక్రమములందు
నందరాని సూక్ష్మాకృతి వైతి వంచు
నెఱుఁగవచ్చెను బలితంపుటిరులు విచ్చె !

నీకు మాకును సంతతోన్మీలితంపు
చెలిమి యైన నాకంఠరంజితరవంబుఁ
బాడుకొననిమ్ము ! నీమీఁదిభక్తిచేత
తెలిసికొననిమ్ము నీయందుఁ గలసిపోవ.

# మఱచిపోయినపాట ౨౩

కొలనిదరి నున్నక్రొమ్మావికోటరమున
నిక్షురసగీతు లొల్కును బక్షిరాజు!
తద్గరున్మాలికాభర్మతాప్రదీప్తి
నాట లాడును బాలసూర్యనవదీప్తి.

కొలనిగట్టుచెట్టుల తీపిఫలములోని
మాకరందస్రుతులు గాన మధురిమములు
స్వచ్ఛగంభీరజలరసస్వాదురేఖ
పక్షిపాడు పాటలలోని భావలేఖ.

ఉదయగర్భంబు వెడలి సూర్యుండు వచ్చు
నస్తమించును జరమశైలాంతరాళ
విపులతామసగహ్వరవీధులందుఁ
గడచుచున్నది కాలచక్రభ్రమణము,

ఆ సరస్సముపాంతవన్యాకుజాళి
వినఁబడె నెదో-విహంగనవీనఫణితి
విభ్రమం బేదో-యెడఁద నావిర్భవించి
పక్షిరాజు వేఁదుఱువోలెఁ బరువు లెత్తె.

క్రొత్తచెలికానిపాటలు క్రోలిక్రోలి
ఎఱుఁగనేలేఁడు! తన పూర్వచరిత మేమొ!

అతితర బహిఃప్రపంచమిథ్యానిలీనుఁ

డెఱుఁగునా యేమి? హృదయనిర్ఝరరవంబు.

ఆ పులుఁ గెటు పోయిన నట్ల పోవు

నది యెటుల కూఁత కూసిన నట్ల కూయు

దానితో లోకమే సమస్తము నటంచు

వెఱ్ఱిపడిపోయె! పాపము! విహగరాజు!

ఆసరస్సు, తత్సవిధకుజాంతరాళ

కోటరంబు, పుల్గులతోటి నాటిచెలిమి

ఆ దిశాంతపుంజీభవదంధతమస

రాసులందు విస్మృతిఁ బొంది యీసడించె.

అతి సముత్తుంగపర్వతప్రతతులందు

విస్తృతపయోధితట మహీవీథులందు

బహుళసత్త్వసమాకీర్ణగహనమందుఁ

గ్రొత్తచెలికానితో తిరుగును బులుంగు.

తప్పివచ్చెనో యేమొ? పతంగరాజు

తనదునాదిమవాస భూతలముఁ జేరె

నాపుడమిఁ జూచినంత పూర్వాధిగమ్య

దీప్తసౌఖ్యానుభూతులు తెలిసివచ్చె.

స్వప్నవీథుల భావసంచరణమట్లు

తదనుభూతసౌఖ్యంబులు తరలివచ్చి

భావలోకవనింజరింపంగఁదొడఁగె
మఱచిపోయిన తనపాట మురువు తెలిసె.

గళము సవరించి చివురుచొక్కంపుతేనె
వాక లైనపాటలు పాడ వాంఛ పుట్టె,
పాడనేలేదు! హృదయము పగిలిపోవు
నంతపట్టు యత్నించిన నైనఁ బుల్గు.

పాటఁ బాడెద నను! నోట మాట రాక
కనులఁ గన్నీరు 'గిరగిర' కార్చికార్చి
పాడనేలేదు పాట-పాపము పులుంగు
అలసిపోయెను! దుఃఖము కలసిపోయె!

---

## ఎదురోళ్లు ౭౪

పూవుందేనెలసోన లింకునో? భృశం
బుక్ బాలసూర్యప్రభా
లీవైశ్వానరసామిధేనులకు మ
ల్లీనూత్నసౌరభ్యముల్
పోవక్ దొంగిలునేమొ? వాయువని యీ
ప్రోద్దెల్ల నిన్వేచితిక్
భావానందలసద్రసప్రసరలో
భభ్రామ్యదిందిందిరా!

# ఒకనాఁడు ౭౫

ఎవ్వరో? నే నెరుంగను ఇంతవరకు
కార్శ్యమూర్తి పలితకేశకాంక్షు వలచి
వచ్చిన జరాలతాంగితో వచ్చినాఁడు
వీథివెంబడి.........

కొన్ని దినముల నీతఁడుగూడఁ బ్రణయి
నీకరంబుల గంధ మందికొనినాఁడు!
తన్మృదుకపోలదర్ప మార్దవములోని
మధురిమరసంబులో మేను మఱచినాఁడు!

కొన్ని దినముల నీతఁడు కుంభినీత
లాంతరాఖిలభాగ్యభోగ్యముల నెల్ల
ననుభవించెద నన్నవాఁడగును...

అని హృదంతరమందు నాకట్టెఁ దోఁచె
కనులు 'గిరగిర' నశ్రులు తొనికి-ఱెప్ప
లట్టె మూఁతలు వడె నప్రయత్నలీల!

ఎన్నినా ళ్లాయె నీవు గతించిపోయి
నాఁడునాఁటికి నీస్మృతిగూడ లేక
మామనంబు లైహికచింతలో మెలంగి
కుమిలిపోవుచున్నవి-కుపిత మైన
కాలపురుషుని శాతనఖంబునందు
లీన మైపోయి, మాకుఁ గల్పించినావు
ఈ మహాదుఃఖభరము భరింపలేము!

ఇంతలో నెంత జరిగిన నేమి చేయఁ
గలము కన్నీరు కాలువల్ కట్టి పొంగి
పొరలునేకాని, యీదుఃఖభరకృశాను
నార్పివేయంగలేవ, యే మందు మయ్యొ
ఈ మనోహరధాత్రి లగించు దివ్య
శాశ్వతసుఖానుభూతి యస్తంగమించె
నయ్యయో! నీదుజీవితమందు సౌఖ్య
సర్గకడకు సమీపించి, చండవాత
పోతములలోనఁ జలియించిపోయినావొ!

ఆ కుపితరాగభావములందు వహ్ని
యేమి చేయఁగలేదు!-దహించి వేయు

నీజగంబుల వ్రేల్మిడి నింతవరకు
దాని గెలిచిన యోధసత్తములు లేరు!

ఏ యనూహ్యాపదంబుల నెచటనుండి
యట్లు పరుగిడి వచ్చునో అంతులేని
ఆ క్షుధాభావవహ్ని - దయాపరీత
లోకరక్షకు నెడఁద. వెల్లువలు పార
ఎంతటియమాయకుఁడవు మాహృదయమందు
మండిపోయెడు శోకధూమములతోడ
నీ స్వరూపము ధావళ్యనిస్తులావి
మోహానం బయి వెలుఁగులు బాహిరిల్లు.

ఏమిలాభము? హృదయాన నింకరాని
శోకలహరీతరంగముల్ ప్రాఁకులాడు
అవలిగట్టు నెరుంగక అడలిపోవు
వాని బంధించుసాంత్వనగాన మేది?

ఈ కురంగము కనపడెనా, కిరాత
శాత బాణప్రసారసంఘాతమునకు
ఇంత కటికంపుగుండె ధరించి నేను
భక్తులను కాతు నంచు డంబంబు లేలొ?
మాయచేఁ గప్పఁబడి జగన్మండలమున
మత్సరము పెంచుకొందు రున్మత్తు లగుచు

నీ విలోలశరీరంబు నేఁగుపిదప
మత్సరంబులు దానితో మాయ మొందు.

ఏ యనంతలోకంబుల నీవు, శాంతి
గీతములు పాడుచున్నావో? గీయమాన
స్వఃపురీ దేవకన్యకాస్వాదురాగ
వల్లకీరావమధురిమ పల్లవింప!

ఈ జగత్తునువీడిన నీ యమూల్య
జీవమూర్తికి శాంతి రచించుగాత!
హృదయవహ్ని స్రవించిన యీ విషాద
బాష్పదామములందు నాభావమూర్తి.

# విశ్వలీల ౭౭

ఎంత పెద్దపొలంబు? ఎంత చక్కనిది!
ఎంత వన్నెలమేలిమంతనా లాడు
ఒకమాటు చీఁకటు లుబ్బి పొంగించు
ఒకమాటు తేజస్సు లుజ్జీవమిచ్చు!
ఓపంటకాపరీ! ఓకృషీవలుఁడ!

ఇంత చక్కనిపొలం బెచటిదో నీకు!
తొలకరివానలందున మొక్కనాటి
ప్రకృతి సాక్షిగ దాని పాలించి మించి
కఱకు కత్తుల కోసి మెఱసిపోయెదవు!

మఱల నాటెదవును, మఱలఁ గోసెదవు
ఏమిటో? యీయాట ఏమిటో గాని?
ఎంత పెద్దపొలంబు! ఎంత చక్కనిది,
ఇంత చక్కనిపొలం బెచటిదో నీకు!

# అజ్ఞాత పరిణామము ౭౭

సంజమబ్బులలోని సౌవర్ణరేఖ
సంజగాడ్పులలోని చల్లదనాలు
అణఁగిన నాహృదయంపు మధ్యమున
సెలయేరువోలె గీతులు మ్రోవఁజొచ్చె!

ఆనందమందిర శ్రేణికావిజ్య
మానవాయూర్మివీథీనృత్యములకు
ఆనందవైపంచికా నినాదంపు
రాగిణీ సూత్న స్వరక్రమంబులకు
నెలుఁగెత్తి పాడితి నేదియో పాట!

అంతంబునందు నే నాలపించినది
గద్గదభగ్నశోకస్వరం బయ్యె!

# తీరరాని సంబంధము ౭౯

నన్ను విడిపోవ నీవు నా నన్న దివ్య
మూర్తులకె తప్పినదిగాదుపో! అతీత
మైన యేకతేజస్సున కాస పుట్టె
బహుళరూపసంకీర్ణతాపదవిఁ జెంద.

నేను పరిణామరూపిణి, నేను విశ్వ
నాట్యమంజీర కింకిణీనాదగతిని.

కడలి జగ మెల్ల మ్రింగి తాఁ గడుపులోన
దాచుకొనుటకు నాశతోఁ దాండవించు!

నేను నిను వెంటఁబడి వత్తు! నీవు వద్దు
పొ మ్మటన్నను నే రాకపోనుసుమ్ము!
ఇది మనకు జన్మసాహస్రపదములందు
పడి యనుగమించుసంబంధబాంధవంబు!

# అశరీరవాణి ౨౦

ఒక నిశీథివేళాస్వప్న ముద్గమించి
నన్నుఁ గొనిపోయె భావనానంతపథుల
కిన్నెరలువోలె నెలుఁగు రాగిల్లుపదము
లల్లుచుండిరి నవ్యదివ్యామృతముల!

పోల్చుకొంటి వా రెవ్వరో పూర్వమందు
పరిచితులువోలె నాకుఁ గన్పట్టినారు!
కరుణచేత నార్ద్రింబులౌ కనుఁగొలఁకుల
మేళవించు వీణియను వాల్మీకి యేమొ ?

మున్ను తాఁ బద్ధబన్నముల్, మొనసి ద్రుపద
రాజుకూతురు తెలుఁగుభారతపుతేఁడు
సొగసుదనముల తిక్కనసోమయాజి
తోడ వేణి విదిర్చి వందురుచుఁ బలుకు!

అతఁడె కాఁబోలు! కాశ్యపుఁ డత్తవారి
యింటికి శకుంతలమ్మ పంపించఁ దలఁచి
మానవప్రేమ మాధురీమర్మ సుధలు
హృదయ మవిసిపో!యెలుఁగెత్తిపిదుకుచుండె.

దీనలై యున్న గోపికా దేవతలకు
భక్తిలోపల రక్తిలోపల వెలింగి

కనఁ బడి కనంబడఁడు వేణుగాయకుండు
ఎంతపని బేలలగువారి వంత పెట్ట?

ద్యోతమానమాధ్వీఝరిణీతరంగ
విహ్వృతిరాజహంసీగరుద్వేల్లనముల
పోతరాజు, మాహృదయాల పుణ్యరాశి
అమృతకలశము తెచ్చినాఁ డదిగో!...

ఆకృతులు లేని యీవిహారావసథపు
టెల్లలందు నెట్టుల నది యిుచు నౌర!
కాలమును దాటి మ్రోఁగు శృంగారగీతి!
పాంచభౌతిక దేహసంబంధ మేది?

మానవనిసర్గమోహనోన్మాద మేది?
మ్రోఁగుచున్నది కాలతమోనిశీధి
తీరములు లేక యీయశరీరవాణి!

# మఱువఁబోకు ! ౮౧

నేను నీ వన్నయెటువంటి దైన ప్రేమ
చూపి నీదయ నిన్నాళ్లు చూచినాను!
మానవానేకసుఖదుఃఖమర్మగతులు!

ఓ ప్రపంచమా! నేను నీయీప్రహర్ష
తాండవం బన్న హృదయము తాండవింప
నెంతగా నవ్వినానో? నా కెన్నిమార్లు
దుఃఖములు మూగినను నీదుగ్ధహాస
దివ్యవీచీమరుత్తుల తేలి పోయి
రాని స్వప్నములట్టుపోవంగఁ ద్రోలి
నానొక్క.

నీవె యెఱుఁగుదు, నిజముగా నీకె తెలియు.
మఱచిపోవకు! నాజీవతరళరేఖ
శ్రావణాంబుదవిద్యుదాశాస్రవంతి
లోన లీనం బయిననాఁడు నేనుగూడ
ఎప్పుడో నీయమూల్యవాహినుల మునిఁగి
పోయినా నని జ్ఞాపక ముంచుకొనుము!
నాతరళదీపికావలన్నవ్యరోచి
ఆయఖండమునందు తా నంత మొందు
నాఁడు నను విస్మరించకు !

నేనుగూడ నీహాసములోన మునిఁగి
నేనుగూడ నీదుఃఖమ్ములోన నీఁది
నీకు సమభాగి నైనాను!

నన్ను మఱవకు! నేను దినాంతసాంధ్య
రాగరక్తిమ మబ్బునై వీఁగునాఁడు!

# వరూధిని ౭౨

ఆఁపఁగరాని యౌవనపు
టాశల పొంగులు రూపుమాపి వి
ద్యాపరమార్థపుంగథల
యందు లయించుట నిన్నుఁబోటి కే
రా! వెఱివార లేరు గల
రా? యిటువంటి విరాగవేదనా
తాపిత దేహవృత్తి మధు
తాండవలబ్ధిఁ దృణీకరింపఁగన్.

ఈయెలజవ్వనంబు నిటు
లేటికిరా? దురవస్థలందు వా
లాయము వ్యర్థపెట్టె దబ
లాజనపీనకుచోపగూహన
శ్రీ యొసలారు ప్రేమ విక
సించిన పూవులతావి తీపికిన్
లే మొలఁదేఁటివోలె తర
ళింపఁగ లేవటరా! మనోహరా!

ఎఱుఁగఁగ లేవుగాని దివి
యెక్కడ, దేవత లెక్కడోయి నీ
తరుణవయోవసంతమునఁ
దాండవమాడెడువార దేవతల్,

పరిమళఫుల్లకౌసుమశు
భంకరవీథుల దైవలోకముల్
పొరపడి యజ్ఞతన్ మునిఁగి
పోకు! దివస్సుఖలబ్ధికోసమై.

ఈపటు తెంచువాయువు లి
వెంతటి మంథరసుందరాధ్వముల్
తీపులకోవ లైన యెలఁ
దేఁటులపాట లి వెంతముగ్ధముల్

ఓ పరమాద్భుతాకృతి! న
వోదయమన్మథమన్మథా! యిదే
రా! పికగానపంచమవి
రావ మి దెంతటిమోహనంబురా!

ఎంతటి రాతిగుండె, మధు
రించిన నీ సుకుమారలీలలం
దింతటి కర్కశత్వ మిది
యెట్టులు వచ్చినదోయి! సౌభగా

క్రాంతము లైననీవెడఁద
కన్నుల నింతవిరాగ మేల? కాం
సంత దరస్మితావధు లె
సంగిన వెన్నెల లాఁగిపోవునా?

ఆసకు లోఁగి నాహృదయ

మంత చలింపఁగ నోరు విప్పి సా

వాసము గోరుకొంటి, తగ

వా! నను నాఁఱడిసేసి పోవ నా

యాసము చూడు నాకుచము

లాఁగక యెట్లు చలించుచుండెనో

మాసర మైన నాహృదయ

మాధ్ర్యము సర్వము బ్రోలఁబెట్టితిన్.

పోవుచునుంటివా!...... యిదిగో?

పోవలదోయి-భరింపలేను మః

ఖావిల మైనయీబ్రతుకు

నాస్యము నొక్కట చూపి పొమ్ము నీ

మోవిని పూచుచిర్నగవు

మోసల వెన్నెల గాయనిమ్ము! అ

య్యో! విధి-పోయినాఁడు...హృద

యోత్థదవాగ్ని నిఁకెట్లు లాఁగుదున్!

'ముక్తాంబిక' యనునాటకమునుండి

పద్యములు

౧౯౨౩

# చదువరులకు

'ముక్తాంబిక' యను నాటకము నుండి పద్యములు, అను నీ పద్యములు మాత్రమే, కవిరచనలందు కాన్పించినవి. ఆ నాటకము కాన్పించలేదు. బాల్యమున వ్రాసిన ఆనాటకము తరువాత కవికి రుచింపకపోవుట వలన, అందలి పద్యములు కొన్ని సంగ్రహముగ నుంచి, తక్కిన భాగము చించి పారవేసి యుండును.

# ఆశీస్సు ౧

శ్రీసంపాదివిలోకనప్రభల నా
ర్తిం బాపి, భక్తావళీ
త్రాసంబుల్ హరియించు నెవ్వనినితాం
తం బైన వాత్సల్యలీ
లా సామర్థ్యము గోపికాహృదయవా
ల్లభ్యం బెవం డూను, స
ర్వేశుం డాయదునందనుండు మిముఁ గూ
ర్మిం బ్రోచెడున్ గావుతన్.

ఏనికృపార్ద్రదృక్ప్రభ ల
యింప దురంతతమస్సమూహముల్,
కానఁగరాక పర్వులిడుఁ
గామితముల్ తగఁ దీర్చునేని నా
మానుగతాచ్ఛ శోభలు ని
రంతరరక్షకుఁడౌ మహేశుసం
ధ్యానవతాండవధ్వనులు
తార్చెడుఁగావుత! మంగళాంకముల్.

# వసంతము ౨

మన్మథజ్యాఘోష మదిగో!
మలయుచున్నది దిక్కులందున
సమద పుంస్కోకిల సుగీతుల
నమృతకళ లొలికెన్.

చివురుదొన్నెల తేనె త్రావిన
అవిరళభ్రమరావళు లవే!
కవికుమారుని భావవల్లికి
రవము లందిచ్చున్!

తూఁగి పొంగిన నామనస్సున
రాగ మదిగో మలఁచుచున్నది!
ప్రోగువడిన వసంతమల్లీ
పుష్పసౌరభముల్!

# విధి 3

ఎప్పటికి నేమి సిద్ధించు నెట్లు జరుగు
దీనిఁ గనుఁగొన లేఁడుగదా నరుండు,
తాన సకలమహీతలత్రాత ననుచు
నగ్గలంబుగ గరువము నందుఁగాని.

దైవకృతములు తెలియ దుస్తరము లగుచు
నిముసమున జరుగఁబోవుదాని వచియింప
లేము దుఃఖతరంగాలు ప్రామికొనునో ?
హర్ష మారుతక్రీడలే అల్లుకొనునో?

# వందిగీతము ౪

అవె! సంధ్యానవమాధురీమయ విహం
గారావముల్ దిక్కులం
జివురించెన్ జరఠప్రభాకరసమ
ర్చిఃస్తోమముల్ చెట్లకుం
గవియుం బంగరునీరు పోసెడునుబో!
కామాశుగంబుల్ పోరిన్
యువతీలోకము బాధవెట్టినవి లే
కుండన్ మృదుస్ఫీతముల్.

# గ్రీష్మము

తరుకోటరంబులఁ దలఁగిరా వెఱచెడు
పులుఁగుమూఁకల కలకలరవాళి,
వేఁడిమిపోఁడిమి వెలికేఁగ వెఱచెడు
క్రూరసత్త్వభయంకరారవములు
ఎండమావుల మోసగింపుల త్రుళ్లింత
లాడుపోవుచు నుండు నధ్వగతతి
ఎండకు శోషిల్లి హీనంపుఁ గళలతో
పొనరారు తీవ్రక్రొంబూవు గములు,
నలరు నీనాఁటి మధ్యందినార్కుఁ డదిర !
వేఁడినిప్పుల చెఱుగుచున్నాఁడు గూడ
ప్రళయకాలభయంకరప్రకటనమున
లోకమును నెంతయే వ్యథాలోలమయ్యె.

తాళఁగాలేము ! ప్రోద్ధత తావకీనాంశు
సంజాతకీలికాసంఘములకు,
ఓరువఁగాలేము ! నురగఫూత్కారాభ
ఘోరవాతూలప్రసారములకు
సహియింపలేము ! ప్రోజ్జ్వలదనూనంబైన
తర్షపీడాసముద్ధతి నొకింత

బ్రతుకఁగాలేము ! శుంభత్తనూవల్లికా
నిర్గతస్వేదవార్నిచయములకు
పొనరుననుకంప మమ్ములఁ బ్రోవుమయ్య !
ఉగ్రరూపము చాలించి యొప్పుమయ్య
తతమహఃపాళికాసమావృతవికాస
జాత నీరేజవర్తి ! ఖద్యోతమూర్తి !

## మనుమసిద్ధి ౬

ఎవ్వానిమకుటసమిద్ధమాణిక్యాంశు
పటలి శాత్రవులకుఁ బ్రాణభీతి
ఎవ్వానికీర్తి వాహిన్యంతరోర్మికా
(రావముల్) దిశల తురంగలించు
ఎవ్వానిపేరు సాహిత్యపీథికలలో
సౌవర్ణరేఖల సంచరించు
ఎవ్వానిదాతృత్వ మినసూను హసియించి
బలిని పాతాళంబు పంపుచుండు,
అతఁడు మతిమంతుఁ డమితశౌర్యంపుమూర్తి
రాజమాత్రుఁడె! శ్రీమన్మరాజు, క్రూర
శాత్రవాళీమదేభచంచత్ప్రికుంభ
నిర్గతోజ్జ్వలమౌక్తిక వర్తమూర్తి!

# ప్రణయబాష్పము ౭

కరుణయును ప్రేమమధురిమ తొరఁగుమీఁద
కనుఁగొలఁకు లింక నన్ జూడఁగలవో లేవో?
నా మనోనాథ! నీచరణ ప్రదేశ
మీయబల కెంతయోఁ బవిత్రాయతనము.

తనివి వోవఁగ మీముఖంబును గనుఁగొన
వ్రాయగా లేదు ధాత, దుర్వారదుఃఖ
సంవలిత మైన నను వరించంగ మీకు
నేమి యొనగూడె సౌఖ్యశ్రీమధురిమ!

నామనస్సరసీజమిత్రా! మదీయ
ప్రణయశోభలు నిపు డెలర్ప నివి యన్న!
వచ్చు జన్మాన నీప్రాణవల్లభనయి
నీకు నెఱపుదు హర్షాతిరేకగరిమ!

# దీనాంజలి ౭

లోకంబుల్ జనియింపఁజేసి కరుణా
లోకప్రభల్ మీరఁగా
జోకన్ బ్రోచి హరించు నీపదయుగా
ర్చుల్, బాలసూర్యప్రభా
ప్రాకట్యంబులు మేలమాడు జగదం
బా! నన్నుఁ జంపింతె, కా
ళీ! కళ్యాణి నమో! నమో! యనుచు నో
లిం గొల్తు నీపాదముల్!

క్రూరుండౌ మహిషాసురాధమునిసం
క్రోధాగ్ని జృంభింప, వి
స్ఫారప్రోద్ధత హేతిఁ గాలుపురికిన్
బంపించు, నీక్రోధభా
వారంభంబులు నేమి యే నెఱుఁగ నా
పై జూపఁగా నొప్పునే!
కారుణ్యామలవిస్ఫురన్నయనరా
గచ్ఛాదితాఘావళీ!

అవనిఁ బిచ్చుకపైన బ్రహ్మాస్త్ర మేయు
శౌర్యజృంభణ మేల? అస్మచ్ఛరీర
మును గొనిన నేమి ప్రాప్తించు ముక్తిదంబ!
క్షమగుణనికురుంబ! శ్రీకాళికాంబ!

# కష్టసుఖములు ౬

జన్మభూమిని బహు కష్టసంచయములు
సౌఖ్యసుస్థిరకరంబులై సాఁగిపోవు,
ఇతరభూముల సౌఖ్యసంతతులుగూడ
దుస్సహాధిబాధాయుతాందోళనములు!

పూట గడువని నిరుపేద పురుషుఁడేని
మాతృభూమినిఁ గొనడు క్షామంపుభీతి,
అది పరబ్రహ్మదివ్యరూపాతిశయము
అచట నమృతపయోనిధు లావరించు!

## చెట్టు ౧౦

వేరు ఉర్వరస్థిరముగా వెలయునేని
తరువు పృథుశాఖికా మనోహరము నగును
సకలకుసుమావళీ ప్రభామసృణ మగును
వేరు బ్రతుకనినాఁడు ఆధార మేమి ?

# సంగ్రామము ౧౧

పోరలి మాత్సర్య మెడఁదలోఁ బెరుగుకతన,
ప్రజల క్షేమాభివృద్ధులు పయికిరావు,
హృదయ మెద్దానఁ గడిఁది లయింపబడునో?
దాని కితర మిం కేమియుఁ గానఁబడదు!

చిఱుతపాపలఁ బెంచుచు మురుసుకొనెడు
తల్లు లెందరు దుఃఖసంతప్తులో కద?
ఎన్నిసంసారములు ధర నీఁగునొక్కొ!
కటకటా! సంగరంబు దుఃఖప్రదంబు!

పెనచు ప్రేముడితీవఁ గట్టినఁ దలిర్చు
జవ్వనులకమ్మఁదనము లేజాడఁ జనునో?
మూఁడుకాళ్ల ముసళ్ల క్రమ్ముకొను దుఃఖ
భారమున కంత మెచ్చట పరఁగు నేమొ?

జనకుఁడును లేడు బంధుఁడు ననుజుఁ డేని
కానఁబడఁడును భయదసంగ్రామవీధి,
ఎన్ని కోర్కెల కిరవు లౌ యెడఁద లెన్ని
ముగిసిపోవునో మాత్సర్య మొగసికొనునో?

## సాయంతనము ౧౨

సమసిపోయినది! ప్రచండభాస్కర ఘృణీ
జాలసౌవర్ణ రాగాలయంబు,
అంతరించినది! విహంగప్రణీతగీ
తారావ మాధురీస్ఫోరకంబు,
తలఁగిపోయినది! శాద్వలము హర్షప్రేరిత
గోపక వేణుగీతాస్వనము,
ముసురుకొన్నది! దైనముగ్ధావిలోచన
స్వాదురాగముల విషాదరేఖ,
అదిగో! వినబడుచున్న దాయాలయమున
మార్మ్రోఁగెడు దివ్యఘంటారవంబు!
లలితపెన్నాతరంగ నర్తనములోన
సాంధ్యమోహనగీతముల్ సందడించె.

నాసర్వస్వమ మైననిన్ను విడి సం
    తాపానలజ్వాలికా
వాసంబుం బొనరించుచుంటి నీక స
    ర్వాత్ముండు విశ్వేశునే
వాసాంగత్యరతిన్, విదీర్ణహృదయ
    ప్లావ్యన్నిరాశాంక వీ
చీసంతానితమారుతాళి నిట పూ
    చెన్ నాతలంపుంబువుల్ !

నీ కనుదోయి నిండినప్ర
    శీతమనోహరరాగమాధురీ
శ్రీకముఁ బాసి నాకనులు
    గ్రీష్మనదింబలె నీదురాకకై
చేకొని మారు చూచెదును
    చెంగలువల్ పులకించునీదునే
త్రాకలితాచ్ఛశోభ లన
    యంబుగఁ జూడగనిమ్ము కోమలీ !

# సంగ్రామము ౧౪

కరుణ సుంతయు లేక సోదరులు, తండ్రి
తనయుఁ డనుభేదములు లేక నినుచ్చుక్రూర
కర్మ్మతను జంపు జీవులమర్మ్మభేద
ఘోరశస్త్రాస్త్రనిహతు లవ్వారిగాఁగ!

నేఁడు నక్కలు కుక్కలు గూడి విందు
లారగించును నీదయాగౌరవమున
భూతపైశాచికాళి విస్మితరీతి
సంతసించును నీకృపాంచలములందు.

సెలలవలెఁ బారునెత్తుటేరులకుఁ బైని
ఘనశవకళేబరములు నౌకలునుబోలె
తేలియాడి కృతాంతునాభీలమహిమ
కంఠఘంటారవము వినఁగలవు నిజము!

ధర్మదేవి నిన్జూచి చింతల గమించు
నీవు స్వేచ్ఛాపదంబుల నెగడవచ్చు!
మొలయుకత్తులలోపల మురియవచ్చు!
నీయదృష్టఫలంబు పండినది నిజము!

# ఖడ్గతిక్కన ౧౫

అదిగో! వినవచ్చుచున్నదా యంచునుండి
ప్రళయభైరవపటహానిస్స్వనసరణి
కకుభమత్తేభకర్ణయుగ్మములయందు
చెవుడు పుట్టెను బెడిదంపురవళి వచ్చి!

కఱకుతరవారి కేలు తామర గదించి
కాళిఁ బూజింప ఖడ్గతిక్కన్నగారు
మనుమసిద్ధీశుఁ గూడి వచ్చు నని పోలు
నరయుచున్నాఁడు రణపాటుఁ డరయ నటు!

## కోమలి ౧౬

పాలఁతిజనములమనము క్రొంబూవుపోలె
మవ్వము చివుళ్లఁబోలె నైర్మల్యధేను
కాంచితస్నిగ్ధనవనీతమటుల మెత్తఁ
దనములకు మెత్తఁదనములు తార్చుచుండు

ఉద్బోధము ౧౭

అతికరాళాసిధారల నరిచయంబుఁ
జీల్చివైచుఁడు! శోణితార్చిర్మనోజ్ఞ
విజయలక్ష్మీగళంబున వేయుఁడయ్య
మత్తకుంభీంద్రమౌక్తికమాలికలను!

ధర్మదేవత నేఁడు యుద్ధంపునేల
నాట్య మాడెడుఁగావుత! నవ్యపాద
కింకిణీప్రాంచదారవకీలితంబు
దానితో పాప మెల్ల నధఃపతితము!

## కాలగీతము ౧౭

క్రమ్ముకొని వచ్చునీతమసమ్ములందుఁ
గ్రమమోహనసాంధ్యరాగము హరించి
కాలశాంఖికుఁ డదిగో! గీతాలు పాడు
కీచురాళ్లరవంబులోఁ గీలుకొలిపి.

# దివ్యయాత్ర ౧౬

అదిగో! జ్వాలలు లేచి వియత్తు నంటు
లాలితపటీరకాష్ఠమాలలఁ దవిల్చి,
వీరరసమే కరుళ్ళుగా మారినట్టి
ఈమహాదంపతీత్వము నే మనందు!

అదిగో! జ్వాలలలోన వియత్స్రవంతి
కాంతరంగసుశీతలస్ఫీతి యదిగో!
దేవగీతాలరవళిలోఁ బ్రోవువడియు
మారు మ్రోఁగెడు దివ్యగంభీరఘణితి.

భళిర! సంతానవాటికాంతలము లందు
విరులఁ గూర్చిన సొబగులసరులు పేర్చి
వేయుచున్నారు వారిగ్రైవేయకములు
అవియు సుమనస్సముజ్జ్వల మైవెలుంగు.

ఆవిశాలాంబరంబున నరుగొ వారు
పోవుచున్నార లంబుదపుంజవమున
వారికీర్తిప్రమోదమంద్రారవములు
పాడుచున్నవి తీయనిఘణితు లల్లి.

## ఖడ్గతిక్కన ౨౦

తావకపరాక్రమక్రమత్వములు చూచి
చలన మొందెను మూఁడు విష్టపము లదిర!
నీ మహీశుని హృదయనిర్నిద్ర మైన
ప్రేమవల్లిక మాత్రము పెగులలేదు!

కాలనిహతిని బశ్చిమాశాలయమునఁ
బడెడు నోచండభాస్కరా! భళి! త్వదీయ
తాపదం బైన చండప్రతాప మదిగో!
మ్రోఁగుచున్నది పులుఁగులరాగలహరి!

# మాతృదేవి

(An Elegy)

## అంకితము

దైవభక్తిపరాయణురాలగు

తల్లిగారికి

(౧౯౨౭ మార్చినెలయందు విరచితము)

# మాతృదేవి జీవితము

గొప్పయింటఁబుట్టి, బీదయింట మెట్టి తల్లి పలువిధములగు కష్టము లనుభవించెను. కాని తనబిడ్డలను చూచుకొని నిరవధి కానందమున, దైవభక్తియందు జీవితకాల మెల్లఁ గడపెను. ౧౯౩౭ సంవత్సరము శివరాత్రికి ఐలూరు కృష్ణాస్నానము చేయవెళ్లి, తిరిగి వచ్చిన పదకొండురోజులకు సన్నిపాత జ్వరముతో స్వర్గమున కేగెను.

మాతృదేవి

## ౧ అశ్రుపూజ

ఒక యేఁడాది గతించిపోయె భవదా
యుస్సంధ్యాకాలాంధకా
రకరాళాస్యములో నిలీన మయి, తీ
రంబోనిహృన్మర్మశ
స్త్రీకలన్ గాయము చేసె నీ బ్రతుకు రా
త్రీనీలిమారాళకై
శోకమున్ విప్పుచు మృత్యునర్తనము మం
జీరమ్ము శబ్దించినన్.

స్మృతిపథమందుఁ దోఁచెడు న
శేష.జగమ్ములు నంధకారమై,
గతిగమనమ్ము లేనియొక
కాఱడవైనభయంకరంపురో
జతికరుణమ్ముగా, హృదయ
మంత విశీర్ణముగాఁగ నేడ్చి, యే
డ్చి తిరిగి యూరడిల్లుదు వి
శీర్ణశరీరపుదుర్బలమ్మునన్.

జ్ఞాపక మున్న దట్టిదివ
సమ్ము పయోదమంద్రగ

ర్జాపులకీభవన్మరణ
రాగము పాడె దివాంధగీత, సం
ధ్యాపతనమ్మువేళ విల
యాంతతమస్సులు చుట్టివచ్చి యా
శాపరజీవలోక హృద
యమ్ము నగాధములోన దింపినన్.

ద్వాదశినాఁటి రేయి జల
దమ్ములు మూఁగి సుధార్ద్రచంద్రికా
మేదురవీథి నెప్డు డల
మెన్, తలపోతల దాఁటి నాఁడె శూ
న్యోదయదిక్తటమ్ములను
ఒక్కతరిన్ బడిపోతి, జన్మజ
న్మోదితపుణ్యసంచయము
లొక్కటికొక్కటి నిష్క్రమించినన్.

ఎన్నాళ్లో అయిపోయినట్లులుగ కా
న్పించెన్ యుగాంతమ్ములే
చన్నట్లుండు, నిగ శతో, అమితత్ర
ష్ణావహ్నితో దుఃఖపుం
డెన్నం జూచుచు శూన్యమానసముతో
దీర్ఘాతినిశ్వాసని

ష్పన్నాశ్రూదకణాళితో దినములో
జన్ బుత్తు నీరీతిగాన్.

తల్లీ! నీదుసుఖస్మృతుల్ మధురశ
బ్దజ్యోతి వెల్గింతు నం
చల్లం బోమెద నీరసం బయినకా
వ్య మ్మొందు, దేహంబు కం
పిల్లం జేయి వడంకు, ముచ్చెమటలన్
భీతిల్లుదున్ హో! సము
ద్యల్లావణ్యమధుస్వరోద్గతులు నా
యందే విశుష్కించెదున్.

# విశోకగీతి

అంబరభర్మహర్మ్యశిఖ
రాంతచరద్విమథామమాధుకుం
భంబున కాలకూటములు
ప్రజ్వరిలెఁ; మలయానిలాంతవే
గంబుల నాశుశుష్ణిశి
ఖావలయంబులు సుళ్లు రేఁగి రూ
క్షం బయిపోయె జీవితవి
పాదతమోంతరశార్వరశ్రుతుల్!

ఈఝురీవేగముల కెదు రీఁదలేక
ఇంద్రియగ్రామ మెల్ల కృశించిపోయె,
నివురు కప్పిన ట్లున్న యగ్నిని రగిల్చి
ఇంధనమ్ములు వేసెద వెవరవోయి!

శాంతరసాపగాధుతతు
పారము లీఁదిన పిల్లగాడుపుల్,
మంతన మాడ నవ్యమధు
మాసరసాలకిసాలభుక్కళా
రంతను నన్ను, దిజ్నివహా
రక్తమహోలయకాళిమాక్తవే
శంతములందుఁ ద్రోసితివి
స్వప్నములాయె మధుప్రవాహముల్.

ఈ నైరాశ్యనిశాంధగహ్వరము లే
లించుఁ మహాదుఃఖసం

తానమ్ముల్ నడయాడు, జీవితవిషా
దధ్వాంతసంచారితఁ

బ్రాణమ్ముల్ వసివాళ్లు వాడినవి ! ని
ర్భాగ్యుండనై యున్ననా

గానంబే విన నెంత ముచ్చటర ! శో
కస్తబ్ధకంఠశ్రుతిఁ.

*

నీవు దైవతమార్గ మొందితి వటంచు
నిన్ను స్మృతివీథులందు వర్ణింతు ననుము !
ఈ హృదయదీర్ఘమరుభూమి నేచి రగిలి
ప్రళయకాలాగ్నిపర్వతమ్ములు జ్వలించు!

మానవానంతజీవితమర్మ మెఱిఁగి
ఐహికానందలౌల్యరహస్య మరసి
తల్లి ! శూన్యమై పడిన నీతనువుచాయ
నేడ్చుచుందును జగములే ఏడ్చిపోవ.

మము నిదురఁబుచ్చి అమృతరాగము స్రవించు
జోలలను బాడి నీచనుబాల నిచ్చి
ఇన్నినాళులు బ్రతికించి ఇప్డు డేగి
ఏడ్వవల దన్న నెట్టుల నేడ్వకుందు.

దిగ్దిగంతము లందందు తెరలివచ్చి
ఘోరకల్లోలములతోడ కొట్టుకొనెడు
జీవితమహాసముద్రవీచీసహస్ర
మది పొరలివచ్చి నాధన మ్మపహరించె.

శైశవానందడోలికాస్వర్గమందు
అణఁగిపోయె సుఖస్మృతు లణఁగిపోయె,
మానసానందరాజహంసీనవీన
గమనరేఖలు కాలాన కట్టువడియె.

జన్మజన్మలనాఁటి వాత్సల్యలతలు
విరియఁబూచిన పూవులు పరువుమాసె,
ఐహికఋణానుబంధము లస్తమించి
అమృతధారలె కాలకూటాగ్ను లుమిసె.

*

ఎన్నిజన్మాలనాఁటిదే ఈఋణంబు ?
తీర్చుకొనలేక యుండిన దీనసుతుల
గిరుకవెట్టి, నిశీథిస్వప్నకథవోలె
పయన మైతి వనంతాభ్రపథము పట్టి.

ఔర్ధ్వదైహికయానము నవధరించి
ఈ విషాదజీవితము త్యజించినావు !
కనులలోపల తిరుగు నీకరుణమూర్తి
కడచనిన దెట్లనంతలోకములు దాఁటి.

ఇంత అలసిన నెంతయో వంత గుండె
దమ్మ! ఈనాటి మాజీవితమ్మునందు
మావిషాదతమస్వినీమధ్యమందు
ఊరడింప రావేమి! నోరారం బల్కి.

శోకనైదాఘతప్తమై స్రుక్కి, స్రుక్కి
చితికిపోయినవీనిజీవితసుమమ్ము
భావిజన్మపరంపరాపథములందు
నీకు పూజాప్రసూనమై నెగడుంగాత!

భౌతికజగత్తులోని సంబంధలవము
కలిపివేసితి నే చితానలములోన,
నాహృదయవీచికావిషానలసహస్ర
శిఖలతోడ భగ్గుమనె జీర్ణతనువు.

శ్యామధూమాగ్రనర్తకసప్తసప్తి
కలసిపోయె నీభౌతికవిలసనమ్ము!
భస్మమైయున్నవహ్నిగర్భంబులోన
భస్మసాత్కృత మయ్యె హర్షస్మితమ్ము.

జోల పాడినశర్వరీబాలయొడిని
సృష్టి పరవశ యగుచు నిద్రించుచుండె,
వీడిపోవనిదుఃఖమే తోడుగాంగ
మేలుకొంటిని నాతల్లి! జోల పాడు!

*

# 3 శ్రావణాశ్రువులు

అంతలోన మాతల్లి జన్మాంతవేళ
స్మృతిపథంబున వచ్చి విచ్చెను సహస్ర
కాళరాత్రీవిషాదాలకములు ముళ్లు
ముసురుకొనివచ్చె నవి పయోముక్త్యయమ్ముగ

ఆ యగమ్యనిశీథరహస్యవీథి
హైమవతకందరాగ్రగౌరీమతల్లి
పాదములకడ నున్న నీస్వాదుమూర్తి,
కన్నుఁగవపొంత నాకు సాక్షాత్కరించె.

ఆ కరాళకజ్జలజలదాంతరాత్రి
భయద మైనతమస్సులో నయనయుగ్మ
చంచల మ్మైననీప్రభాశంప వెలిఁగి
మన్మదశ్రువర్షాంబువుల్ మల్లడించె.

బాహిర మ్మైన ఈవిశ్వభాగమందు
మామకీనాంతరాళమ్ముమధ్యమందు
ఏకరీతిగా ప్రావృడుత్సేక మెడలె
తల్లి! నాశరీరోష్ణమ్ము చల్లవడియె!

మఱల వచ్చెను శ్రావణమాసలక్ష్మి
తొలఁకె దిక్తటులందు మాధుర్యవృష్టి.

నీలపాయోధరాగ్రమందిరములందు
తాండవించెను విద్యుల్లతామతల్లి!

భూమితలగతసౌదామనీమనోజ్ఞ
మధురమూర్తులు శ్రావణమాసవేళ
శాంకరీపదాబ్జాతపూజాప్రసాద
ములు గ్రహించి పుణ్యాంగనల్ వెలిఁగినారు.

దివ్యమాహేశ్వరీపదాన్తికములందు
మోడ్పుకనుదోయితోడుత మోకరిల్లి
వినతు లొసఁగెడుమాయమ్మ- కనఁబడదట!
చర్మచక్షుస్సు లక్ష్యవిశ్వమునయందు.

# ౮ పాథేయము

ఆ మహాశివరాత్రిసంధ్యావసాన
కాలనాథరణన్మంజుకంకణములు
రాజతాద్రిగుహాకందరములలోఁ
శైవదివ్యప్రసాదముల్ సంతరించె.

ఆ యనంతసాగరసంగమాభిలాషి
నిర్మలపయస్వి కృష్ణవేణీమతల్లి
ఆ యనంతసౌందర్యము నరయఁబోవు
నిన్ను స్నాత్రిఁ గావించె పున్నెములు పండ.

నాఁడె మ్రోఁగిన మధురసంధ్యావిపంచి
దివ్యవీథుల నీకు పాథేయ మిచ్చె,
అలసబుద్ధులపాథేయ మాదరించి
ఇన్ని కరుణాంబువులు ప్రసాదించు తల్లి!

నాయనా రమ్ము-అని నీవు నన్నుఁ బిలిచి
నట్టు లున్న దే-మనని శాంతమ్మునందు
నిదుర పట్టనినాకంటియెదుట నిలుము
తల్లి! కన్నీటిధార పాద్యమ్ము నిత్తు!

అలసిపోతివి మందబుద్ధులను జేరి
కలసిపోతివి యామినీగర్భమందు,

ఆ యనంతనిర్వాణరాహస్య శయ్యా
విశ్రమింపుము! నాతల్లి! విశ్రమించు.
ఎన్నినా ళ్లాయె నమ్మ! నీఈ శరీర
మంతరించి, యుగమ్ములే యంతరించి
నట్టు లున్నవి, దుఃఖేంధనములుమాత్ర
మెప్పుడు సమస్ఫులింగమ్ములే జ్వలించు.

ఎక్కడికి పోతివే తల్లి-ఇన్నినాళ్లు
ఎప్పుడో వత్తు వనియె స్మరించుచుంటి,
ప్రతినిముసమందు నీదగు స్మృతికథనము
ఇది యబద్ధ మేమో యనియే తలంతు.

ఈ యనంతావధికి నంత మెక్కడమ్మ!
నీకు నాకు మధ్యఁగలట్టి నిశ్చలాబ్ధి
పారమున తీర మెచట చేకూరు తల్లి!

అన్నియును పోయినవి-ఆశ లాఁపు కొన్న
పోవఁజాల వీస్మృతిపటంబులు-బుసబుస
పొంగిపోయెడు రక్తతరంగధార
లమ్మ! కన్నబిడ్డలయెడ నాదుకొనుము!

ఏ జననమందో దురదృష్ట మేచి వచ్చి
తల్లి లేనిబిడ్డఁ జేసి వెళ్లిపోయె,
కర్మఫలములు వేయి లక్షలును వచ్చి
హృదయపటములో నిన్ను మాయింపలేదు!

# ౫ వినాయకచవితికి

ఇది నవోషస్సమీరసంహృతజలేజ
హృదయకందళమ్మృదురజోభ్యుదయవేళ
శాంకరీదేవిమధురవాత్సల్యలక్ష్య
మతఁడు వేంచేసినాఁడు గణాధిపుండు.

పూవుటేరాల చివురాకుప్రోవులందు
కలికితనపుమవ్వమ్ము వెన్నెలలు కురిసి
పత్రి ప్రోగుచేసెడి శిశుభావ మరసి
మఱచిపోతి తమస్సతీమంత్రసూక్తి.

ఏమఱచిపోయియున్న పూజామహత్తు
నాహృదయమందు పూచె నానందసుమము
గడచియున్న సుఖస్వప్నకలన తలఁచి
ఇన్ని యశ్రూదబిందువు లేటికొందు.

ఏమనోతీత మాదివస్సీమలోని
శాంకరీదేవి దివ్యపూజల లయించి
ఎచట నుంటివో! మాయమ్మ ఈవిషాద
దుఃఖములతోడ నిచట నే తూఁగుచుంటి!

నిరుడు గణపతి మనయింటి కరుగుదెంచి
తల్లి! నీకృపామధురహస్తమున నుండి

ఇన్ని మోదకమ్ములను భుజించినాఁడు

చిఱుతలము మాకు వేయియాశీస్సు లిచ్చి.

నీవు మా కింక బ్రతికియున్నా వటంచు

తలఁచె పాపము! ఈమంచిమలమనుమఁడు,

మన కుటీరకవాటము నెనసివచ్చి

తలుపు తీయు మటంచును తట్టినాఁడు.

## ౬ ఉగాది

నీదు వాత్సల్యమధువు చిందించుకొన్న
ప్రతియుగాదికి నీకరార్పితము లైన
వేఁపపూఁతలు తినెడుజీవితసుఖంబు
అణఁగిపోయె నగాధస్మృత్యంతరముల.
కొలఁది చేఁదైన వేఁపపూఁతల నొసంగ
తినఁగలము గాని ఘణిఁణాంతికములందు
తావకవియోగబహిరంతరావృత మగు
నీవిషరసమ్ము నెట్లు భుజింతు తల్లి!

*

ఆ విశాలసముద్రరోధోంతరమున
ఇసుకపడకలయందు చిహ్నితము లైన
అడుగుజాడలు వీచికాభ్యంతరముల
కలసిపోవును కాఁబోలు తెలియకుండ.
ప్రతితరంగనర్తనములో పడి నశించి
వెనుకటిమనోజ్ఞగీతులు మునిఁగిపోవు
ఈ విపర్యయజీవనభావగతికి
ఊట యైపోయె వేఁడికన్నీటిధార!
మఱల కనుపింపఁబోదు కావలయు నమృత
వాహినులపుట్టినిల్లు, జీవనపుటాశ

మా ఉపాస్యదైవతము, మాత్ర్యదప
నిరవధిక మైనకాలమందిరముమాలోన!

మాహృదయవీథి మండుగ్రీష్మము శమింప
తల్లి! పావిత్ర్యరాశి నీతనువులోని
ఎముకలనుబట్టి సానరాయిడిని గంధ
మరగఁదీసి, మాక్షుద్రదేహాల పూసి

నీ సుఖోద్యానమధురమందిరములందుఁ
బడి విలాపించు మావంటి బడుగువాండ్ర
కనికరించి, క్షీరాంభోధికనదనూన
లోలవీచిడోలికల నుయ్యాల లూఁపి,

సప్తసాగరవలితవిశ్వప్రవృత్తి
నెఱుఁగ కొక్కశయ్యాడోలయే జగంబు
గాఁగి, నాదుదినమ్ములు గడుచునాఁడు
నీ యమృతమూర్తి నొక్కటే నే నెఱుఁగుదుం.

ఆ యనంత తారాపథ మ్మావరించి
రాజ్య మేలేసుధాంశునార్ద్రింపుగీతి
భువికి నాహ్వాన మొనరించుపూఁటయందు
నీవె నాకు తోడైతివి నిత్యమూర్తి!

ఈ మహావిశ్వజలధిలో నేచి వచ్చి
పొంగి పొరలుతరంగాలపోటులందు
నాదునౌక చలింపకుండఁగ నమర్చి
పాటిపోయినయొకకర్ణధారి వమ్మ!

# ౭ పూజ

నాజననకారణంబవు, నా హృదబ్జ
పీఠికాంతరనిలయవు పిదికినావు,
అమృతమాధుర్యములను పయస్సులను గృ
పానిధీ! మాతృదేవి! యిదే నమస్సు!

నీ దయావృష్టి నిన్నినా ళ్లీధరిత్రి
భయదములు వ్యాధులను దాఁటి బ్రతికినాను,
సతతమును తావకీనదృక్సముదయాచ్ఛ
శోభలం ద్రావుటమె నాకు నీభవంబు.

చిపురుప్రాయమ్మునాఁడు నా చిఱుఁనగవులు
నీదుప్రేమామృతమ్ము; న నీఁదులాడ
నీసమస్తము నేనె యం చోసవిత్రి
మఱచితివిగూడ నీధరామండలంబు!

ఆ జగత్కర్తకన్న నీయమలపాద
నీరజములు పునఃస్మరణీయము లగు
నాకుఁ గావున హృదయవిన్యస్తభావ
కుసుమములఁ బూజ సేయుదుఁగొనఁగదమ్మ!

# నా తల్లి!

౧

ఈ మహాదుఃఖనిబిడవాహినులలోన
నలఁత పోఁగోరి యెచటికో అరిగినాను,
అచ్చటయుఁగూడ దుఃఖంపుటగ్నికీల
కాజ్యధారాసహస్రము లావహిల్లె.

పంచభూతముల్ ననుఁ జూచి పలితహాస
మొలికినవి కాని యూఁఅడఁ బలుకలేదు,
అబ్ధిగర్భబాడబముహూరాయతాగ్ని
అంతకంతకు జృంభించి రంతులాడె.

౨

మాగృహంబున కేగితి, మధురసార్ద్ర
మైన కంఠస్వనాంచలాధీనపణితి,
'ఏమిరా! నాయనా!' యని యింత కాని
ప్రేమ మాయమ్మ పిలిచె సుధామృదూక్తి.

అపుడు నాదేహమా! చందనార్ద్రపంక
లేపనోజ్జ్వలశీతలస్నాపితంబు!
అపుడు నేనా! జగచ్ఛయాధిపమనోజ్ఞ
తరళమంథరహాససౌందర్యనిధిని!

# ఫలశ్రుతి

౧

నేను తొలిసారి విశ్వమందిరములోన
నడుగు వెట్టితి మధురరసార్ద్రగీతి
నాఁటినుండి పరస్పరానందనాట్య
దివ్యలీలల యుగములు తిరిగిపోయె.

౨

హృదయనాళమునుండి స్రవించివచ్చు
ప్రతికదుష్ణరక్తకణమ్ము భావ మయ్యె,
అది జ్వలించినయంత నాయార్ద్రకంఠ
నిర్గతము లయ్యె పాలమున్నీటియలలు.

3

ఈ హృదయరక్త మెల్ల స్రవించిపోయి
నేను శాశ్వతమూర్తినై నిలుచునపుడు,
గడచిపోయిన నాజన్మగాథ లెల్ల
ఆ మధురగీతి లోకుల కందఁజేయు!

*

# స్వస్తి

అచట, నా మాకరందరాహస్యగర్భ
తరుణవాసంతకాలమాధురులు పూచె,
అచట, నా మల్లికానికుంజాంతరాళ
కనదనూనమాధుర్యవాసనలు తోఁచె!

పోవుదము రండు! మాధవపూజకొఱకు
పోవుదమురండు! హృదయము పూచుకొఱకు.
అచట నకుతోభయంబు, సాంధ్యప్రణీత
రాగరక్తిమలందు పారాణి మనకు,

మధురిమం బైనకల్యాణమంటపమున
లోకమునకు లగ్నంబు లల్లుకొని రండు!
పోవుదము రండు! మాధవపూజకొఱకు
పోవుదమురండు! హృదయము పూచుకొఱకు.